



తజిక్ సాహితీ కళోత్సవం మాస్కోలో
1957 ఏప్రిల్ 9వ తేదీ నుండి 20
వరకూ జరుపబడింది.



తజిక్ సోవియట్ సోషలిస్టు రిపబ్లిక్‌కు సంబంధించిన వ్యాసాలను 1–12, 14–16, 29–31, 34–35 పుటలలో చదవండి.

సంపుటి 8
సంచిక 10

# సోవియట్ భూమి

మే 25, 1957

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచార శాఖవారు తెలుగు, హిందీ, ఉర్దూ, బెంగాలీ, తమిళం, మలయాళం, పంజాబీ, మరాఠీ, ఒరియా, కన్నడ, ఇంగ్లీషు భాషలలో ప్రచురింపబడుతోన్న సచిత్ర పక్ష పత్రిక



కొద్ది కిలోమీటర్ల అఫ్ఘన్ భూమిచే భారత దేశం నుండి విడిపడి వున్న తజికిస్తాన్ సరిహద్దులు చాలా క్లిష్టమైనవి. ఈ రిపబ్లిక్‌కు తూర్పువేపున ఉన్నత పర్వత ప్రదేశమైన పామీర్లున్నాయి; సోవియట్ దేశంలోని యీ ప్రాంతానికి "ప్రపంచపు పైకప్పు"అని అంటుంటారు. కొండలూ, పర్వత ప్రాంత ప్రదేశాలూ, సారవంతమైన లోయలూ కలసివున్న మండలం వుంది, పడమరను. ఈ రిపబ్లిక్ ముఖ్య పట్టణం స్టాలినాబాద్ యిక్కడే వుంది. తజిక్‌స్తాన్లోని యీ భాగం నుండి ఒక చిన్న ముక్క ఎగువకు పోయివుంది. ఇది లెనినాబాద్ మండలం. ఇది ఫెర్గానా ఒయాసిస్సులో వుంది. ఇది మధ్యాసియాలో కెల్లా అతి రమణీయమైన, సారవంతమైన ప్రదేశం.

అక్టోబరు సోషలిస్టు మహావిప్లవానంతరం వివిధ జాతుల వారి ప్రాంతాల సరిహద్దులు నిర్ణయింపబడి, జనాభాలో అధిక సంఖ్యాకులు తజిక్కులై వున్న ప్రాంతాలతో ఒక ప్రత్యేకమైన రిపబ్లిక్ ఏర్పరుపబడింది. ఈ రిపబ్లిక్ పెద్దది కాదు. దాని వైశాల్యం 142,000 చదరపు కిలోమీటర్లు మాత్రమే. దాని జనాభా పద్దెనిమిది లక్షలు మాత్రం. కాని యావత్తు సోవియట్ దేశమూ తన చిన్న పర్వతాల రిపబ్లిక్కు సాధించిన విజయాలకు గర్వపడుతూ వుంది. ఆ విజయాలు యీ సంచికలో వివరించబడ్డాయి.





కైరక్-కుమ్ జలవిద్యుత్కేంద్ర

# "తజిక్ సముద్రం"

## వొఖిద్ కరబయేవ్

తజికిస్తాన్లోని వారమైన మేము సముద్రాల గురించి చాలా విషయాలు విన్నాము. అవి మాకెంతో దూరంగా వున్నాయి. మా రిపబ్లిక్‌లో చాలా ఉన్నత పర్వతాలున్నాయి. దాని భూభాగంలో నూటికి 93 వంతులు పర్వత శ్రేణుల చేతనూ, పీఠభూముల చేతనూ ఆక్రమించు కొనబడి వుంది. అవును, మాకు పర్వతాలు అవసరమైన దానికంటె ఎక్కువగానే వున్నాయి!

ఇటీవల మేము ఒక స్వంత "సముద్రా"న్ని కూడా సంపాదించాము. నిజమే, అది కృత్రిమమైనది, కైరక్-కుం అన్న స్థలం దగ్గర సిర్-దర్యా నదికి డాము కట్టిన మనుష్యులు తయారు చేసినది. ప్రమాణంలో కూడా అది పెద్దదికాదు; అంతా కలిసి సుమారు ఏబై వేల హెక్టార్లు. కాని ఎన్నడూ "ఎక్కువ నీళ్ళు" చూడని పర్వతారోహకులమైన మాకు అది అపారంగా, వాస్తవంగా కనిపిస్తుంది.

నీరులేని లక్షలాది హెక్టార్ల భూములకు నీటిని తీసుకవచ్చిన పెద్ద కాలువలూ, చిన్న కాలువలూ సోవియట్ మధ్యాసియా రిపబ్లిక్కులలో—ఉజ్బెకిస్తాన్, తజికిస్తాన్, తుర్క్‌మెనియా, కిర్గీజియా—గత ముప్ఫయ్యేళ్ళలో త్రవ్వబడ్డాయి. అయినా యింకా సాగులోలేని, నీరు లేని బయళ్లు చాలా వున్నాయి. సిర్-దర్యాకు దగ్గరగా, సారవంతమైన ఫెర్గానా లోయకు ప్రక్కగా వుంది వాటిలో ఒకటి. ఇది పంటలు పండని స్టెప్పీ, సుమారు పదివేల చదరపు కిలోమీటర్లు ఆక్రమించుకుని వుంది. తొలి సోవియట్ పరిపాలనా కాలంలో స్టెప్పీలను సాగులో పెట్టడానికి, లెనిన్ ప్రతిపాదన పైని ఒక నిర్ణయం చేయబడింది. ఎడారిలో ఒక భాగానికి నీటి వసతులు లభించాయి. ఈ కొత్త "సముద్రం" సహాయంతో యీ స్టెప్పీ భూమి దాహాన్ని తీర్చడం యిప్పుడు మాత్రమే సాధ్యపడుతుంది.

మధ్యాసియా లోహానది సిర్-దర్యా చాలానీటిని ప్రవహిస్తుంది. కాని ప్రకృతి దానిని చాలా దుబరా చేసేస్తూవుంది. ఏడాదికి మూడు



నిర్మాణము (ఛాయాచిత్రకారుడు ఎ. బొల్యకోవ్)

సార్లు వరదలు వచ్చి నాట్లు కొట్టుకపోతాయి. ఒడ్డునవున్న పల్లెలూ, పట్టణాలూ నాశనమవుతాయి. ఇక నీరు అధికంగా వుండని రోజుల్లో లోయల్లోని చాలా కాలువలు ఎండిపోతాయి. ఫర్హద్ జల విద్యుత్కేంద్రము టర్బయిన్లు తిరగడం మాని వేస్తాయి.

ఈ కేంద్ర నిర్మాణం—సిర్-దర్యా పైని కట్టిన వాటిలో యిది మొదటిది—ఫాసిస్టు వ్యతిరేక యుద్ధ కష్టకాలంలో ప్రారంభమైంది. దీనిని ప్రజలు నిర్మించారు: సిర్-దర్యా నదిని, అదుపులో పెట్టడానికి అపారంగా పెరిగిన ఉజ్బెకిస్తాన్, తజికిస్తాన్ పరిశ్రమలకు విద్యుచ్ఛక్తిని అందజేయడానికి, సిర్-దర్యా నీటిలో ఒక భాగాన్ని పంటలు పండని స్టెప్పీ ముఖద్వారానికి, దల్వెర్జిన్ పీఠభూమికి పంపడానికి ఐచ్ఛికంగా ఇళ్ళనుండి బయలుదేరి వెళ్ళిన వేలాదిమంది కార్మికులు, సమిష్టి రైతులూ దీనిని నిర్మించారు.

కాని ఫర్హద్ జల విద్యుత్ నిర్మాణం సిర్-దర్యాను పూర్తిగా పూర్తిగా అదుపులో పెట్టలేదు. నది రాళ్ళ మధ్యగా ప్రవహించే చోట యిది నిర్మింప బడింది. అందువల్ల జలాశ్రయం కట్టడం అసాధ్యమైంది. రెండవ యుద్ధానంతర పంచవర్ష ప్రణాళికా కాలంలో, 1951 వేసవిలో యీ "సముద్ర" నిర్మాణానికి పూనుకోవడం జరిగింది. సిర్-దర్యామీద, కైరక్ కుం వద్ద, తజిక్ నగరమైన లెనినాబాద్‌కు దగ్గరగా నిర్మాతలు రెండవ జలవిద్యుత్ నిర్మాణాన్ని ప్రారంభించారు.

నిర్మాతలు మొదట సిర్-దర్యాను వెనుకకు నెట్టారు, హైడ్రో యింజినీరింగ్ నిర్మాణానికి పెద్ద పునాదిని త్రవ్వడానికి స్థలాన్ని సంపాదించేందుకు. పునాది గోతిలో బ్రహ్మాండమైన రియన్ ఫోర్స్డ్ కాంక్రీట్ డాము లేచిన తర్వాత, యీ మహానదీ గర్భంలో రాళ్ళతోనూ, కాంక్రీట్ స్థంభాలతోనూ, అత్యల్పకాలంలో, అంటే ఏడు గంటలలో డాము నిర్మింపబడింది. నదీ జలాలు స్పిల్ వేకు అడ్డంగా ప్రవహించడం మొదలైంది.

1956 డిసెంబరులో యీ కొత్త జల విద్యుత్కేంద్రపు రెండు టర్బయన్లు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేయడం మొదలైంది. ఈ ఏడాది మిగతా నాలుగు టర్బయన్లు పనిలో పెట్టబడతాయి; యీ కేంద్రం కెపేసిటీ 150,000 కిలోవాట్లను అందుకుంటుంది. కైరాక్-కుంను, ఉదాహరణకు దీనికి పదిహేను రెట్లు విద్యుచ్ఛక్తిని ఉత్పత్తిచేసే ఓల్గా పైనున్న కుయ్‌బిషెవ్ కేంద్రంతో సరిపోల్చ నట్టయితే, పెద్దదేమీ కాదు. కాని ఉజ్బెకిస్తాన్, తజికిస్తాన్ విద్యుదుత్పత్తికి, కైరాక్-కుం విద్యుచ్ఛక్తి పెద్ద భాగంగా వుంటుంది.

విద్యుచ్ఛక్తే కాకుండా కైరాక్-కుం, మధ్యాసియా రిపబ్లిక్కుల



కైరక్-కుమ్ "సముద్రం"

[ఛాయాచిత్రకారుడు: ఎ. పొల్యకోవ్]

లకు, వాటికెంతో విలువగల నీటిని కూడా యిస్తుంది. మధ్యాసియా అంతటికీ పెద్దదైన జలాశ్రయం అక్కడ నిర్మింపబడింది. ఈ "తజిక్ సముద్రం" యిప్పటికే 70 కోట్ల క్యూబిక్ మీటర్ల నీటిని నిలవచేసింది. వచ్చే వేసవినాటికి నీటినిలవలు 400 కోట్ల క్యూబిక్ మీటర్లను మించుతాయి. ఎక్కువగా నీరు వచ్చే రోజుల్లో యీ జలాశ్రయం నీటిని కూడబెట్టి, తక్కువగా నీరువచ్చే కాలంలో, సాలుకు 220 కోట్ల క్యూబిక్ మీటర్ల వరకూ నీటిని వదిలిపెడుతుంది. ఈ బ్రహ్మాండమైన "నీటి బ్యాంకు" మూలంగా సిర్‌దర్యా ఎప్పుడూ సమంగా ప్రవహిస్తుంది, దానిపైనున్న స్టేషన్లు ఎప్పుడూ పూర్తి కెపాసిటీతో పనిచేస్తాయి. యుగయుగాలనాటి ప్రజల స్వప్నం— విశాలమైన స్టెప్పీ భూములను సాగుక్రిందికి తీసుకరావడమన్నది— సత్యం కావడానికి అవకాశం లభించింది కూడా యిప్పుడు.

1956 వేసవిలో ప్రభుత్వం ఒక నిర్ణయం చేసింది, 1956-62లో స్టెప్పీ భూమిలో మూడు లక్షల హెక్టార్ల భూమినీ, ఉత్తర తజికిస్తాన్లోనూ, దల్వెర్జిన్ పీఠభూమిలోనూ చాల సారవంతమైన 50 వేల హెక్టార్లకు పైగా భూమినీ సిర్ దర్యా నీటితో యిరిగేట్ చేయడానికీ, వాటిలో ప్రత్తి మొదలైన పంటలనూ పండించడానికీ యీ నిర్ణయం. ఈ ఒక్క స్టెప్పీలోనే ప్రత్తిపంట సాలుకు 1.2 మిలియన్ల టన్నులకు పెంచబడుతుంది. ఇది గత ఏడాది ఉజ్బెకిస్తాన్లో తీయబడిన ప్రత్తిలో యించుమించు సగభాగం.

ఇకనుండీ సిర్ దర్యానది సోవియట్ మధ్యాసియాలోని ముగ్గురు సోదర ప్రజలకు, ఉజ్బెక్, కజక్, తజిక్ ప్రజలకు సేవ చేస్తుంది. కైరక్-కుం కేంద్ర నిర్మాతలలో సోవియట్ దేశంలోని 37 జాతుల వారున్నారు. వెయ్యిమందికిపైగా స్థానికులు, తజిక్‌లూ, ఉజ్బెక్కులూ యీ నిర్మాణ స్థలంలో నిర్మాణ వృత్తులను నేర్చుకున్నారు. కార్మిక ప్రజల అభిమతానుసారంగా సిర్‌దర్యానదిపైనున్న యీ నూతన కేంద్రానికి "ప్రజామైత్రి" అని నామకరణం చేయబడింది.

సిర్‌దర్యా అంటే తజిక్ భాషలో "వింత నది" అని అర్థం. దాని వింతల రహస్యం కనిపెట్టబడింది. ఈ మహానది మానవుని వినయ విధేయతలతో సేవిస్తుంది.

---

"తజిక్ సముద్ర" దృశ్యం ఎంత మనోహరంగా వుంది ఇక్కడ: →

# మాస్కోలో



చిరునవ్వుతోన్న ఈ బాలికలు. మాస్కోలో జరుగుతున్న తజిక్ సాహిత్య కళోత్సవంలో ప్రదర్శన లిస్తున్న రుబోబ్ వాద్యబృందసభ్యురాండ్రు. రుబోబ్. ఒక ప్రాచీన తజిక్ వాద్యం

(ఛాయాచిత్రకారుడు : ఓ. క్నోరింగ్)

# తజికిస్తాన్

## > ఎ. ఇస్మయిలోవ్ <

...ఎత్తుగా, కప్పివున్న గుర్రపుబళ్లు ధూళిరేగుతూవున్న దారివెంబడిని మెల్లగా సాగిపోతూ బాధగా కీచుపెడుతున్నాయి. ఈ బళ్ళలో ప్రయాణం చేస్తోన్న నటులు చాలా యిబ్బందిపడుతున్నారు.

వాళ్లు గ్రామంలోనికి వచ్చాక వారి పాటలను వినడానికి గ్రామ జనాభా అంతా వస్తుంది. ప్రదర్శనానంతరం ఒక వృద్ధ కర్షకుడు, ఒక నటుని దగ్గరకు వెళ్ళి అతనిని ప్రక్కకు తీసుకవెళ్ళి యిలా చెప్తాడు :

"పాత రోజుల గురించి మీరు పాటలు పాడేరు, మన కొత్త జీవిత పద్ధతంటే సరిపడనివాళ్ల గురించి మీరు పాటలు పాడేరు. ముఖం కప్పుకోకుండా, తజిక్ స్త్రీలు పాడడమూ, ఆడడమూ వాళ్ళ కిష్టం లేదు. వాళ్ళు మీకు కీడుచేయడానికి ప్రయత్నిస్తున్నారు. తొందరగా వెళ్ళిపోండి, వెళ్ళిపోండి..."

ఇదంతా ఎప్పుడు జరిగింది ? అదే సినీమా ?

తజికిస్తాన్ ప్రజా కళాకారిణి, నర్తకి అయిన అజీజా అజిమోవా నాకు చెప్పిన ఒక ఘటన యిది. ఈ బళ్ళలో ప్రయాణం చేసిన వాళ్లు ప్రథమ తజిక్ నాటక సమాజం సభ్యులు. ఈ ప్రఖ్యాత తజిక్ నటి దీనిలోనే తన కళా జీవితాన్ని ప్రారంభించింది.

మూసివున్న బళ్ళలో ప్రయాణం 1927 లో జరిగింది. ముప్ఫయ్యేళ్ళ క్రితం మాత్రమే యిది జరిగింది. కాని వీరి జీవితం యీ కాలంలో ఎలా మారింది, అప్పట్నుండీ యీ సోవియట్ రిపబ్లిక్ నాటక కళ ఎటువంటి ప్రగతిని సాధించింది ?

అజీజా అజిమోవా జీవితం, తజిక్‌నటి జీవితానికి ఒక చక్కని ఉదాహరణ. ఆమె ఒక పేద రైతు కుటుంబంలో పుట్టింది. ఇంకా చిన్న పిల్లగా వున్నప్పుడే ఆమె నాట్యప్రావీణ్యం ఆమె గ్రామంలో ప్రశంసింపబడింది. కాని ఆమె నటి కావడం ఎలాగ ? అది కూడా వృత్తినటి ఎలా అవుతుంది ? ముఖం కప్పుకోకుండా యితరులకు కనిపించడమా ! ఆమె తండ్రి యిటువంటి విషయాన్ని ఎన్నడూ ఊహించనైనా ఊహించలేదు.

ఇంకా చిన్నపిల్లగా వున్నప్పుడే అజీజా యింట్లోంచి పారిపోయింది. ఆమె స్టాలినాబాద్‌కు వెళ్ళిపోయింది. అక్కడ అనుభవజ్ఞులైన ఉపాధ్యాయులూ, గాయకులూ ఉన్నారు. ఆమె సామర్ధ్యం పట్ల వారికి పెద్ద అభిప్రాయం కలగడంవల్ల, వారామెను మాస్కోకు పంపించారు. ఆమె ముఖ్యపట్టణంలోని నాటక కళా విద్యాలయంలో పట్టభద్రురాలయి స్వీయప్రదేశానికి తిరిగి వెళ్ళింది. అక్కడ నామె నాటకాలలో పాత్రలు వేయడం మొదలు పెట్టింది. తరవాత ఒక గేయ, నృత్యనాటక సమాజం ప్రారంభింపబడ్డాక ఆమె ప్రధాన నర్తకి అయ్యింది. పి. చైకొవస్కీ యొక్క "సుప్త సుందరి", ఆర్. గ్లియేర్ యొక్క "రెడ్ పోప్పీ" మొదలైన చాలా నృత్యనాటకాలలో పాత్ర ధరించిన ప్రథమ తజిక్ నర్తకి యీమే. ఆమె "దిల్బార్" అన్న నృత్యనాటకంలో కూడా నృత్యం చేసింది. ఈ నృత్యనాటక వస్తువు, తలిదండ్రులను వదిలి పారిపోయి నృత్యనాటకి నర్తకి అయిన ఒక సామాన్య కర్షక బాలికకు సంబంధించిన కథ, అజీజా అజిమోవా దానికి తానే మాటలను కూర్చింది.

రంగాలంకరణ, దుస్తులు అద్భుతంగా వున్నాయి. సంగీతం గొప్పగా వుంది. నృత్య నాటకాన్ని చూస్తూ వందలాది మంది నృత్య నాటక నటీమణుల గురించి, యిప్పుడు నృత్య నాటకాలలో నటిస్తోన్న అజీజా అజిమోవా శిష్యురాండ్ర గురించి నేను ఆలోచిస్తూనె వున్నాను. వారి జీవితం అనేక విధాలా ఆమె జీవితం వంటిదే, రిపబ్లిక్ ముఖ్య పట్టణంలోని నాటక సమాజానికి తమ తమ గ్రామాలనుండి నేరుగా వచ్చిన వారే, వారుకూడా.

సోవియట్ దేశ ప్రజా కళావేత్త ముఖమెజాన్ కసిమోవ్ జీవిత కథకూడా యిదే.

నాటక సమాజానికి గర్వకారణమైన వ్యక్తి కసిమోవ్. షేక్స్‌పియర్ "ఒథెల్లో", "కింగ్ లియర్"లలో నాయకపాత్రలనూ, అధునాతన సోవియట్ రచయితల నాటకాలలో పలు పాత్రలనూ ఆయన ధరిస్తారు.

ముఖమెజాన్ కసిమోవ్‌ను యిటీవల నేను కలుసుకోవడం తటస్థించింది. ఆయన చాలా అలసిపోయినట్టుగా కనిపించారు.

"ఎంతో పనుంది. కొంచెంకూడా తీరుబడి లేకుండా అహోరాత్రులు పని—పది రోజులపాటు...."అన్నారాయన.

## "మాస్కోలో తజిక్ సారస్వత, కళా దశదినోత్సవం"

—అని వున్న పోస్టర్లు యీ ఉత్సవాన్ని ప్రచారంచేస్తూ మాస్కో అంతటా పెట్టబడ్డాయి.

యస్. ఐనీ తజిక్ అకెడిమిక్ గేయ నృత్య నాటక సమాజం, సోవియట్ దేశ బోల్షివిక్ నాటకశాలలో ప్రదర్శించింది. ఇక్కడ తజిక్ నృత్య నాటకాలైన "దిల్బార్", నొవోయ్, నిజామీ గానం చేసిన ప్రాచీనగాథ అయిన "లైలా, మజ్నూ"కూడా ప్రదర్శింపబడ్డాయి. సంగీత నాటకం "పులత్, గుల్రూ" ఒక యువక వాగ్గేయకారుడైన యస్. హెచ్. సైఫిద్దినోవ్ రచించినది, "మజెప్పా", పి. చైకొవస్కీ రచించిన గేయనాటకం, యివికూడా బాగా ప్రజాదరణను చూరగొన్నాయి.

తజికిస్తాన్ ఎ. లఖూటి నాటక సమాజమూ, స్టాలినాబాద్ రష్యన్ నాటక సమాజమూ కూడా ముఖ్య పట్టణంలో ప్రదర్శనలిచ్చాయి. వారు ప్రదర్శించిన వాటిలో షేక్స్‌పియర్, గోర్కీ, మయకోవస్కీ నాటకాలూ, తజిక్ రచయితల నాటకాలతోబాటు అధునాతన సోవియట్ నాటకకర్తల నాటకాలూ వున్నాయి.

ప్రభుత్వ సంగీత సమాజం—ప్రథమ తజిక్ నృత్య నాటక నర్తకి అజీజా అజిమోవా దీనిని నడుపుతోంది - అనేక సంగీత బృందాలతో కూడినది. స్త్రీల కమ్మని రుబోబ్ (యిది ఒక జాతీయ సంగీత వాద్యం) సమాజం గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి.

ద్వితీయ ప్రపంచ యుద్ధానికి కొంత ముందర—అప్పుడు పంజికెంత్‌లో పురావస్తువులకోసం త్రవ్వకాలు సాగుతూ వున్నాయి—అక్కడ ఒక మంచి ప్రాచీన శిలాఫలకం దొరికింది. పంజికెంత్, తాజిక్కుల పూర్వీకులైన సొగ్దియన్లు స్థాపించిన చాలా పాత నగరాలలో ఒకటి. శిల్పి యీ ఫలకంమీద దీర్ఘమైన ప్రాచ్య దుస్తులు వేసుకుని, వింతరూపంలో కొంతవరకూ వీణను సరిపోలివున్న సంగీత సాధనాలను పట్టుకునివున్న యిద్దరు బాలికల ప్రతిమలను చెక్కాడు.

ఈ శిల్ప చిత్రం ఒక పురావస్తు పత్రికలో ముద్రింపబడింది. కాని గాయకులకు కొంత కాలానికిగాని యిది తెలియలేదు.





నృత్యరూపకం "దిల్బార్"లో ఒక దృశ్యం
[ఛాయాచిత్రకారుడు: ఓ. క్నోరింగ్]

వారికి చివరికి తెలిసినప్పుడు శిలమీద చెక్కివున్న అపరిచిత వాద్యం, తజిక్ ప్రజల అతిప్రాచీన సంగీత సాధనాలలో ఒకటని వారు ఊహించారు. పామీర్ పర్వతాలలోనూ, మధ్య తజికిస్తాన్లోనూ జీవిస్తోన్న అతివృద్ధులకు మాత్రమే యీ వాద్యం కాస్త జ్ఞాపకం వుందని తరవాతను తెలిసింది. ఈ వింత వాద్యాన్ని వారు రుబోబ్ అన్నారు. చాలా అన్వేషణ జరిగాక రుబోబ్ యొక్క పాత నమూనాలు గిస్సార్ లోయలోని కొన్ని మారుమూల గ్రామాల్లో దొరికాయి. ఈ వాద్యాలు కాలగమనంలో శిధిలమయ్యాయి. ఇప్పుడు వాటిని ఎవ్వరూ వాయించడంలేదు. ఇప్పుడు వాటిని కొత్తగా పరిశీలించాలి, శిలాజములను పరిశీలించినట్టుగా.

కొందరు గొప్ప తజిక్ సిద్ధహస్తులు ఎక్కువగా సోవియట్ రుబొబ్‌లను తయారు చేయాలనుకున్నారు. వాళ్లు పెద్ద మల్బెర్రీ చెట్ల కోసం కొండ ప్రాంతాలకు వెళ్లారు. రుబొబ్, మల్బెర్రీ కర్ర ఏకఖండం నుండి తయారు చేయాలి. బిగ్గరగానూ, బలంగానూ వచ్చే దానినాదానికి రహస్యం యిదే.

వాద్యాలు తయారయ్యాయి. వాటిని వాయించడం నేర్చుకోవడం మొదలుపెట్టారు, వాద్యకారులు. పునరుద్ధరింపబడిన రుబోబ్, మళ్ళీ తజికిస్తాన్లో అభిమానాన్ని చూరగొన్నది.

ఇంకో మంచి బృందం, పామీర్ బృందం. దానిలో కూడా యువకులే వున్నారు, వారి సగటు వయసు 18 ఏళ్లు.

తజిక్ కళోత్సవాలలో యిప్పటికి రెండుసార్లు ప్రదర్శించిన యీ బృందం కృషి ఫలితంగా (యుద్ధం మొదలు కావడానికి కాస్త ముందుగా 1941 లో మాస్కో ప్రథమ దశ దిన ఉత్సవం జరిగింది), సోవియట్ దేశంలోని అత్యున్నత పర్వత ప్రాంతమైన పామీర్లలో (యీ పర్వత శిఖరాలు భారత దేశపు హిమాలయాలకు యిరుగు పొరుగుగా వున్నవి) నివసించే ప్రజల కళ, సోవియట్ దేశ ప్రజలకు పరిచయ మయ్యింది.

పామీరు ప్రజలు చాలా ఉల్లాసంగా ఉంటారు, హాస్యప్రియులు. వారి సంభాషణల్లో హాస్యాలు దొర్లుతుంటాయి.

చాలా సందర్భాలలో దుస్తులూ, నృత్య వస్తువులూ గ్రామాలలో ప్రదర్శించినప్పట్లాగానే ఉన్నాయి. ఒక బట్ట, ఒక కర్ర చాలు గుర్రంమీద దౌడుతీస్తోన్న రౌతువేషాన్ని నటునికి యివ్వడానికి.



కుమ్రీ మసలోవా, రుబోబ్ వాద్యబృంద నర్తకి, బెంగాలీ నృత్యాన్ని ప్రదర్శిస్తూ. [ఛాయాచిత్రకారుడు: ఎల్. రాస్కిన్]

పామీర్ నటబృందం ప్రదర్శించిన అశ్వ నృత్యం
[ఛాయాచిత్రకారుడు: ఓ. క్నోరింగ్]





"అశ్వనృత్యం" ఆటగానూ, హాస్యంగానూ కూడా ఉంటుంది. కత్రలు, గుర్రాలు, కత్తులతో నృత్యాలు ఒకటి తరవాత ఒకటి జరుగుతాయి.

మాస్కోలో పదిరోజుల పండగ తజిక్ కళలకే కాకుండా, తజిక్ సారస్వతానికి కూడా అంకితమైనది. గత ఐదేళ్ళలో తజిక్ గ్రంథకర్తలు వ్రాసిన మూటికిపైగా గ్రంథాలు, రష్యన్ భాషలోనికి అనువదింపబడి ప్రచురింపబడ్డాయి ఉత్సవ సమయంలో. మీర్జా తుర్సున్-జాదే రచించిన నవ్యగీతావళి, ఉత్సవ సమయంలో ప్రచురింపబడింది. కవి భారత దేశయాత్ర గురించి యీ పుస్తకంలో చాలా భాగం ఆక్రమించింది. వీటికాయన "ఆశియా వాణి" అని నామకరణం చేశారు. మిర్సైద్ మిర్షాకర్—యీయన కూడా యిటీవలెనే భారతదేశయాత్ర చేసి తిరిగి వచ్చారు—"పామీర్లలో లెనిన్" అన్న పద్య కావ్యాన్ని వ్రాసేరు. ఒక కొండగ్రామంలో సోవియట్ పరిపాలన ఎలా స్థాపింపబడిందో దీనిలో వివరింపబడింది.

ఉత్సవానికి మాస్కోకు తీసుకురాబడిన వచన రచనలలో, యిటీవలనే మరణించిన ఐనీ "స్మృతులు" మూడు నాలుగు సంపుటాల గురించి ప్రత్యేకంగా పేర్కొనాలి. విప్లవానికి పూర్వపు బొఖారా జీవిత విజ్ఞాన సర్వస్వమని వీటిని అనవచ్చును.

తజిక్ అనువర్తిత కళాప్రదర్శనలో మాస్కో ప్రజలు చిత్రాలకూ, గ్రాఫిక్ కళకూ, శిల్పానికీ, నాటక రంగాలంకరణలకూ, అనువర్తిత జానపదకళకూ చెందిన సుమారు 600 వస్తువులను చూశారు.

తజిక్ కళలు ఎంతోకాలంగా వస్తున్నవి. ఇప్పుడు ప్రదర్శింపబడుతోన్న కొన్ని నృత్యాలూ, గీతాలూ వందల సంవత్సరాలనాటివి. అయినా అది చాలా సంకుచితమైన కళ కూడా. తజిక్‌స్తాన్ దాస్యంలో వున్నప్పుడు, దండయాత్రలవల్ల, తమ భూస్వాములవల్ల, అమీర్లు, ఖానులవల్ల, జారిస్టు ప్రభువులవల్ల తజిక్ ప్రజలు బాధలు పడుతూ వున్న కాలంలో అంతరించిపోతూ వుండిన తజిక్ కళలు పునర్జన్మను పొందాయి, సుందరతరమైన, వివిధమైన జానపద కళలయ్యాయి.

---

యురా-త్యూబె (తజిక్ జాతీయ రీతికి చెందిన బుకేదారీ పనికి కేంద్రం). ఛాయాచిత్రంలో: సుప్రసిద్ధ బుకేదారి కుట్టుపనిస్తోన్న నర్జీ మమురవా
[ఛాయాచిత్రకారుడు: ఎల్. రాస్కిన్]

తజికిస్తాన్, లఖూతీ నాటకశాల ప్రదర్శించిన "కింగ్ లియర్". లియర్, కార్డీలియా పాత్రలలో సోవియట్ దేశ ప్రజా కళాకారుడు ముహమ్మద్జాన్ కసీమోవ్, తజిక్ రిపబ్లిక్ విశిష్ట కళాకారిణి ఖైరీ నజరోవా
[ఛాయాచిత్రకారుడు: వి. షఖోవ్‌స్కీ]

పామీర్ నటబృందం ప్రదర్శించిన పక్షుల నృత్యం
[ఛాయాచిత్రకారుడు: ఒ. క్నోరింగ్]







# భారత, తజికిస్తాన్ల మధ్య ప్రాచీన సంబంధాలు

« ప్రొఫెసర్ ఎ. సెమ్యోనోవ్ »

*తజికిస్తాన్ శాస్త్ర విజ్ఞాన పరిషత్సభ్యులు*

తజికిస్తాన్, భారత దేశాల మధ్య సాంస్కృతిక, రాజకీయ సంబంధాలు ప్రాచీనకాలం నుండీ వస్తున్నాయి. మాసిడోనియాకు చెందిన అలెగ్జాండర్ ప్రాచ్యదేశాల పైని చేసిన దండయాత్రలు, గ్రీసు, ప్రాచ్య సంస్కృతుల సమ్మేళనానికి తోడ్పడ్డాయి. ఆ మహా విజేత సామ్రాజ్య శిధిలాల పైని స్థాపింపబడిన గ్రీకో-బాక్ట్రియన్ రాజ్యం, అధునాతన తజికిస్తాన్ యించుమించు భూభాగమంతాగల ఆ రాజ్యం భారత దేశం, గ్రీసుదేశాల మధ్య మాత్రమే కాకుండా, భారత దేశానికీ, స్థానిక జనాభాకూ మధ్య కూడా సన్నిహిత సంబంధాల నేర్పర్చడానికి సాయపడింది. ఈసాంస్కృతిక సాన్నిహిత్యం గ్రీకో-బౌద్ధ కళ (గాంధారకళ) అనబడేదాని స్థాపనకు కారణమయింది.

మన శకపు రెండో శతాబ్దంలో భారత దేశంనుండి మధ్యాసియాకు బౌద్ధమతం వెళ్ళి, మన శకపు ఎనిమిదవ శతాబ్దంవరకూ అక్కడ పాతుకుని వుండేది; ఆ తరవాత ఇస్లాం దానిని నిర్మూలించింది. తజిక్ ప్రజల పూర్వీకుల ప్రాచీన నగరమైన, ప్రస్తుత కత్తా-కుర్గం నగరానికి సమీపంలోని కుషనిర్‌లో—యావత్తు జరవ్ షాన్‌లోయ సంస్కృతిజీవితం అక్కడ కేంద్రీకృతమై వుండేది—ఒకగృహం వుండేదనీ దాని గోడలపైని వివిధ దేశాల సార్వభౌముల చిత్రాలు చిత్రింపబడ్డాయనీ, యీ గృహము తూర్పు గోడపైని భారతీయ, తురుష్క ప్రజల పాలకుల చిత్రాలున్నవనీ ఒక చైనీస్ కథ మనకు చెపుతోంది.



భారత-తజిక్ సంబంధాలు, చరిత్ర, పురావస్తు, నరవర్గ శాస్త్రాలయ సిబ్బ ఉద్యోగులతో ప్రొఫెసర్

సస్సానిదే కాలంలో భారత దేశానికీ మధ్య ప్రాచ్య, మధ్యాసియా ప్రజలకూ మధ్య సంస్కృతీ సంబంధాలు వర్ధిల్లాయి. పంచతంత్రం మధ్య ఎస్షియన్ భాషలోనికి (పెహెలీవి). "కాలిలోక్ వ దిమనక్" (రెండు నక్కల పేరిట) అన్న పేరుతో అనువదింపబడింది. "కలిలా, దిమ్న" అన్న పేరుతో యిది సర్వత్రా సుప్రసిద్ధమయింది. తరవాత చాలా కాలానికి, 16 వ శతాబ్దంలో తజిక్ భాషలో హెరత్ పండితుడు హుస్సేన్ వయిస్ అల్-కషెఫి దీనిని "అన్వర్-ఐ సుహైలీ" అన్న పేరుతో అద్భుతంగా తిరిగి వ్రాసేరు. "నావికుడు సింద్‌బాద్" అన్న ప్రసిద్ధ గ్రంధం భారత దేశం నుండి వచ్చింది.

అరబ్ దండయాత్ర భారత, మధ్యాసియా ప్రజల సంస్కృతి సంబంధాలను త్రెంపివెయ్యలేదు. పది, పదకొండవ శతాబ్దాలలో మధ్య యుగాల ప్రసిద్ధ పండితుడు, ఖొరెజంకు చెందిన అల్-బిరూనీ సంస్కృతానీ, భారత దేశ సారస్వతాన్నీ, ఆచారవ్యవహారాలనూ,

సంస్కృతినీ గొప్పగా అధ్యయనం చేశారు.

భారత దేశంలో ఇస్లాంమత వ్యాప్తితోనూ (పదకొండవ శతాబ్దం), అక్కడ ముస్లిం రాజ్యాల స్థాపనతోనూ భారత దేశానికి, మధ్యాసియాకు మధ్య యింకా సన్నిహిత సంబంధాలు గోచరమవుతున్నాయి. పారసీక భాషను మాట్లాడే భారతీయ కవుల, గద్య రచయితల గ్రంధాలు చాలా మధ్యాసియాకు వ్యాపించాయి. అక్కడ అవి బాగా ప్రజాదరణను పొందాయి, తజిక్ భాషను అర్థం చేసుకునేవారిలోనూ, చదివేవారిలోనూ. వారి గ్రంథాలను చూచి వ్రాసుకున్నారు, అవి చాలా ప్రతులు చెలామణీ అయ్యాయి. ఉదాహరణకు, భారత దేశానికి చెందిన ప్రఖ్యాత పారశీక కవి అమీర్ ఖుస్రూ దెహ్లెవీ (యీయన 1325లో మరణించారు)



ప్రదర్శనాలయంలో తజిక్ శాస్త్ర విజ్ఞాన పరిషత్తు ఎ. సెమ్యోనోవ్ (మధ్య)

[ఛాయాచిత్రకారుడు: వి. పిచ్కుల్యాన్]

రచనలు మధ్యాసియాలో బాగా పేరు పొందాయనీ, ఎంతో ఆనందంతో అవి అక్కడ పఠింపబడ్డాయనీ మనకు తెలుసును

తైమూర్ వారసుడు షారో భారతదేశానికి, విజయనగర చక్రవర్తి వద్దకు రాయబారాన్ని పంపడం, భారత దేశానికీ, మధ్యాసియాకూ ఆ రోజుల్లోగల దౌత్య సంబంధాలను ప్రతిబింబిస్తోంది ఈ రాయబారానికి చరిత్రకారుడు కెమాలుద్దీన్ అబ్దుర్రజాక్ ఇబిన్ ఇషాక్ సమర్కందీ నాయకత్వం వహించారు అయన 1442లో హెరాత్‌నుండి ఒర్ముజ్‌కు బయలుదేరారు, భారత దేశ యాత్రను, తరవాత సముద్రం మీదుగా తిరిగివచ్చారు. ఈ రాయబారం గురించి అయన వివరంగా, ఆసక్తి జనకంగా వ్రాశారు.

15వ శతాబ్దంలో భారత దేశంతో సంబంధాలు గల తైమూరిద్స్, మరుచటి శతాబ్దంలో ఆ దేశానికి వెళ్ళారు. సంచార జాతులైన ఉజ్బెక్కులు మధ్యాసియాపైని దండయాత్ర చేసినప్పుడు వారిని గొప్పగా ప్రతిఘటించిన తైమూరిద్ బాబర్-మీర్జా కాబూలుకు తిరోగమించవలసి వచ్చింది. అది అయన ఉత్తర భారత దేశ ఆక్రమణకు వేదిక అయ్యింది. అయన తదుపరి మొగల్ సామ్రాజ్యాన్ని స్థాపించారు. ఈ ఘటనలన్నీ భారత దేశానికీ మధ్యాసియాకూ మధ్య అనేక దశాబ్దాలపాటుగా సాంస్కృతిక, రాజకీయ సంబంధాలను త్రెంపివేశాయి. కాని అవి యించుమించు 1530 మొదలు కాని మళ్ళీ మొదలయ్యాయి. మొగలు చక్రవర్తుల భారత దేశానికి వెళ్ళి, ఆ దేశంలో చాలా ఫలప్రదంగా కృషిచేసిన కొందరు కవుల, గాయకుల, సంగీతవేత్తల పేర్లను, ఆ రోజులనాటి కొన్ని స్మృతిచిహ్నాలు మనకు తెలియజేస్తాయి. మొగల్ మహా సామ్రాజ్య స్థాపకుడు బాబర్ మధ్యాసియానుండి భారత దేశానికి హ్రస్వ చిత్రలేఖనా ప్రవీణులను తొలిసారిగా తీసుకవచ్చారు. 16వ శతాబ్దపుతొలిపాతికేళ్ళకు చెందిన సచిత్ర భారతీయ లిఖిత పత్రాలు కొన్నిటి విషయంలో, అవి మధ్యాసియాలో లిఖింపబడినవా, ఢిల్లీలో లిఖింపబడినవా అన్న అనుమానం కొంత వుంది.

మధ్యాసియా, భారత దేశాలమధ్య రాజకీయ, సాంస్కృతిక సంబంధాలు, మధ్యాసియాలో ఉజ్బెక్ రాజ్యం బాగా బలపడిన తరవాత, 16వ శతాబ్దం ఉత్తరార్ధంలో ముఖ్యంగా పెంపొందాయి. సుప్రఖ్యాత మధ్యాసియా తజిక్ కవి ముష్ఫికి మామూలు వ్యక్తిగా ఒకప్పుడు భారత దేశంలో వున్నారు, తరవాత అక్బర్ చక్రవర్తి వద్దకు షెయ్‌బనిద్ అబ్దుల్-ఖాన్ రాయబారంలో సభ్యునిగా మళ్ళీ భారత దేశానికి వచ్చారు. ఆ రాయబారాన్ని జ్ఞాపకంచేస్తూ ముష్ఫికీ రచించిన అక్బర్ ప్రశంసాగీతాలు వున్నాయి. అబ్దుల్‌ఖాన్ అక్బర్ దర్బారుకు చాలామంది బొఖారా, సమర్కంద్ కళాకారులను కూడా పంపించారు.

ఆ తరవాత 17వ శతాబ్దంలో మధ్యాసియా భారత దేశాల మధ్య యింకా యెక్కువ సన్నిహితంగా సంబంధాలు పెంపొందాయి. ఆ రోజుల గురించి తెలియజేసే ఒక రచనలో, బొఖారా నగరంలో ఒక చాలా పెద్ద భారతీయ పేట వుండేదని వుంది. నగరంలోని ఒక ప్రత్యేక భాగంలో, చుట్టూరా ఎత్తయిన ఒక ప్రాకారంతో అది వుండేది అష్తర్ ఖానిద్ ఇమామ్ కులీ-ఖాన్‌కు జహాంగీర్ చక్రవర్తికీ మధ్య దౌత్య సంబంధాలగురించి, ఆ రోజుల్లో వైద్యునిగా, కవిగా ప్రసిద్ధి పొందిన హాకీం హాజిక్ యీ సంబంధాలలో నిర్వహించిన పాత్ర గురించి కూడా మనకు తెలుస్తోంది. ఔరంగజేబ్ సుభాన్ కులీ-ఖాన్ పరిపాలనలలో 17వ శతాబ్దం ఉత్తరార్ధంలో, భారతదేశపు మొగల్ మహా సామ్రాజ్యానికీ, అష్తర్ ఖానిద్ మధ్యాసియాకూ మధ్య దౌత్య సంబంధాలు కూడా వుండేవి.

మధ్యాసియాలో గొప్ప రాజకీయ సంక్షోభాలు జరిగిన 18 19వ శతాబ్దాలలో యీ దేశానికీ, భారతదేశానికీ మధ్య దౌత్య సంబంధాలు చెడ్డాయి. కాని స్థానిక మధ్యాసియా జనాభా ముస్లిం భారతదేశ సంస్కృతినుండి ఉత్తేజాన్ని పొందుతూనే వుంది. బెదిల్‌వంటి భారతీయ కవులు (ఈయన 1721 లో మరణించారు), షెయిక్ అహ్మద్ ఫరూక్ మొదలైన వారివంటి సూఫీలూ మధ్యాసియాలోని తజిక్ భాష వారయిన ప్రజలచే గొప్ప గౌరవాన్ని పొందేవారు భారత దేశానికి చెందిన చాలా మంది సూఫీ షెయిక్‌లకు మధ్యాసియాలో చాలామంది శిష్యు లుండేవారు. తమ మత నాయకులతో వారికి మంచి సంబంధాలుండేవి. వారి మర్మ రచనలను యిక్కడ చదివి, తిరిగీ వ్రాసి పంచిపెట్టేవారు. ఇందువల్లనే మధ్యాసియాలో భారతదేశపు సూఫీ లిఖిత గ్రంధాలు ఎన్నో కనిపిస్తాయి.

ఇంకోవేపున నసిర్-ఇ-ఖుస్రూచే 11వ శతాబ్దంలో బదక్షాన్‌లో ప్రవేశ పెట్టబడి 18వ శతాబ్దంనుండి దాని పెద్ద నాయకులయిన ఆగా ఖాన్ల ఆధిపత్యానగల ఇస్మాయిల్ మతం—ఆగాఖాన్లు ఇరాన్‌నుండి భారతదేశానికి తరలి వెళ్ళారు—పామీర్ ఇస్మాయిల్ మతస్థులకూ, ఆగాఖాన్ల నివాసమైన బొంబాయికీమధ్య సంబంధాల స్థాపనకు తోడ్పడింది ఈ సంబంధాలు ఒక ప్రత్యేక లక్షణంగలవైనప్పటికీ కొంతవరకూ అవి యూరోపియన్ పండితులకు ఇస్మాయిల్ సారస్వతానికి చెందిన, ఆసక్తి గొలిపే ప్రాచీన స్మృతి చిహ్నాలను పరిచయం చేయడానికి తోడ్పడ్డాయి.

(మిగతది 21 వ పేజీలో)

# ఒకనాటి వెనుకబడిన మండలం నేడు సిరిసంపదలకు నిలయం

ఇం టి రష్యా

మా దేశం అక్టోబరు విప్లవానికి ముందర జారిస్టు రష్యా సామంత రాజయిన బొఖారా అమీర్ స్వంత ఆస్తిగా వుండేది. తూర్పు బొఖారా అని పిలువబడేది. నీటి పారుదల సదుపాయం గల భూమి యించుమించుగా యావత్తు అమీర్‌కూ, ధనిక భూస్వాములకూ చెంది వుండేది. అప్పుడున్న పరిశ్రమ అల్లా చేతి వృత్తుల పరిశ్రమ మాత్రమే.

సోవియట్ పరిపాలనలో వున్న 33 ఏళ్ళలో తజికిస్తాన్ సోవియట్ దేశం లోని సమానమైన, పారిశ్రామిక—వ్యావసాయక రిపబ్లిక్కులలో ఒకటిగా పెంపొందింది. విప్లవానికి పూర్వపుకాలంతో పోల్చినట్టయితే మా భారీ పరిశ్రమ మొత్తంగా ఇంచుమించు 800 రెట్లు అయ్యింది. మా రిపబ్లిక్‌లోని కొత్త పత్తి, సిల్కు మిల్లులు, జిన్నరీలు, నూనె ప్రోసెసింగ్ కర్మాగారాలు యావత్తు సోవియట్ దేశానికి చాలా ప్రాధాన్యం గలవి. కొండల ప్రాంతంగా వున్న మా రిపబ్లిక్‌లో సీసం, తుత్తునాగమూ, ఆర్సెనిక్, ఒజొసెరైట్, ఫ్లోర్-స్పర్, బంగారం, ఆప్టికల్ ఫ్లోరైట్, యింకా చాలా అపురూపమైన లోహాలూ, ఖనిజాలూ అధికంగా వున్నాయి.

తజికిస్తాన్ గొప్ప పత్తిపంటలను పండిస్తోంది. గత ఏడాది హెక్టారు ఒక్కింటికి సగటు పత్తిపంట 22.6 సెంట్నార్లు. విప్లవానికి పూర్వపు కాలంతో పోల్చినట్టయితే, పత్తి సాగు క్రింద నున్న భూమి ఐదురెట్లు, పండిన పత్తి 13 రెట్లు హెచ్చింది.

విప్లవానికి ముందర రెండువందల మందికి ఒక్కడే అక్షరాస్యుడు. మొత్తం దేశంలో పది పాఠశాలలు మాత్రమే వుండేవి. ప్రస్తుతం మేము గ్రామసీమల్లో సార్వత్రిక సప్తవర్ష విద్యనూ, నగరాల్లో దశవర్ష విద్యనూ అమలు జరిపాము. మాకు సుమారు 2,600 పాఠశాలలున్నాయి. ఏసు నాటకశాలలూ, 1500కు పైగా క్లబ్బులూ, సుమారు రెండువేల గ్రంథాలయాలూ మా చిన్న రిపబ్లిక్కులో వున్నాయి. అరవై వార్తా పత్రికలు, మొత్తం 540,000 ప్రతులలో పదకొండు పత్రికలూ ప్రచురింప బడుతున్నాయి. పుస్తకాలు లక్షల్లో ముద్రింప బడుతున్నాయి. ఈనాడు తజిక్ ప్రజలకు స్వంత మేధావులున్నారు. వారికి 14 వేల మంది ఉపాధ్యాయులూ, నాలుగువేల మందికి పైగా యింజినీర్లూ, టెక్నీషియన్లూ, 5,500 వైద్యరంగంలో పనిచేసే వారూ, మూడువేల మందికి పైగా వ్యవసాయ ప్రవీణులూ వున్నారు.

ఆరవ పంచవర్ష ప్రణాళికా కాలంలో మేము చేయదలుచుకున్న దేమిటి? 1961 వరకి మా పరిశ్రమ 1.6 రెట్లు ఉత్పత్తిని ఎక్కువ చేస్తుంది. ఒక పెద్ద సిమెంట్ మిల్లును మేము నిర్మింప బోతున్నాము. రిపబ్లిక్ ముఖ్య పట్టణమైన స్టాలినాబాద్ లోని బట్టల మిల్లుకు, యిప్పుడున్నదానికి యింకో సగభాగం చేర్చబడుతుంది, అది సాలుకు 8 కోట్ల 20 లక్షల మీటర్ల బట్టను తయారు చేస్తుంది. లెనినాబాద్‌లో సోవియట్ దేశం అంతటికీ పెద్ద టివాసీ నేత మిల్లు నిర్మింప బడుతుంది. అది సాలుకు 21 లక్షల చదరపు మీటర్ల టివాసీలను తయారు చేస్తుంది. బొగ్గుతీత బాగా అధికం చేయబడుతుంది, గనుల పనీ, నాన్-ఫెర్రస్, అపురూప లోహాల ప్రోసెసింగ్ అధికం చేయబడుతుంది. ఈ ఐదవ పంచవర్ష ప్రణాళిక ప్రారంభంలో కంటె మా రిపబ్లిక్కు 2.3 రెట్లు యెక్కువగా డబ్బాలలో నిలవచేసే ఆహార పదార్థాలనూ, నాలుగు రెట్లు యెక్కువగా పాల వస్తువులనూ ఉత్పత్తి చేస్తుంది.

పరిశ్రమాభివృద్ధి తప్పక జరగాలంటే ఎక్కువగా పవర్ అవసరమవుతుంది. మా రిపబ్లిక్‌కు,

(మిగత 35వ పుటలో)



తజిక్ సోవియట్ సోషలిస్ట్ రిపబ్లిక్ ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ అధ్యక్షుడు ఇస్మత్ నదులయేవ్

*తజిక్ రిపబ్లిక్ ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ అధ్యక్షుడు ఇస్మత్ నదులయేవ్, బుఖారాలోని ధనిక భూస్వాముల వద్ద వ్యవసాయ కూలిగా పూర్వం పనిచేసినవారు. ఆయన 17 ఏళ్ల ప్రాయంలో 1921లో రెడ్ ఆర్మీలో చేరారు; బస్మాచ్ దొంగల ముఠాలపైని చర్యలలో పాల్గొన్నారు. తజికిస్తాన్‌ను తమ వలసగా చేసుకోవడానికి ప్రయత్నించిన బ్రిటిష్ సామ్రాజ్యవాదులు యీ ముఠాలను పోషించారు. 1924లో తజిక్ సోషలిస్టు రిపబ్లిక్ ప్రకటనలో ఆయన పాల్గొన్నారు. సంపాదకవర్గం తజికిస్తాన్ ప్రభుత్వ ప్లానింగ్ కమిషన్ అధ్యక్షుణ్ణి, యీ రిపబ్లిక్కు జాతీయార్థిక వ్యవస్థ సాధించిన విజయాల గురించి, భవిష్యత్తులో గల అవకాశాల గురించీ మా పాఠకులకు తెలియజేయమని కోరింది.*

అంతర్జాతీయ సమీక్ష

# పాక్షిక నిరాయుధీకరణ చర్యల గురించి సోవియట్ ప్రభుత్వ ప్రతిపాదనలు

—లండన్, 30-4-57 (టాస్)

ఏప్రిల్ 30వ తేదీన సోవియట్ దేశ ప్రతినిధి వి. ఎ. జోరిన్ సోవియట్ ప్రభుత్వ ఆదేశానుసారం, పాక్షిక నిరాయుధీకరణ చర్యల గురించిన సోవియట్ ప్రభుత్వ ప్రతిపాదనలను మిత్రరాజ్య సమితి నిరాయుధీకరణ కమిషన్ ఉపసంఘానికి సమర్పించారు.

కొత్త సోవియట్ ప్రతిపాదనలు కనీసపు నిరాయుధీకరణ చర్యలు అమలు జరగాలని సూచిస్తున్నాయనీ, అవి అమలు జరగడం అవసరమనీ, సుసాధ్యమనీ, తక్షణావశ్యకమనీ సోవియట్ ప్రభుత్వ అభిప్రాయమనీ వి. ఎ. జోరిన్ అన్నారు.

ప్రప్రథమంగా అణు హైడ్రోజన్ ఆయుధ పాటవ పరీక్షలను మానివేయడం లేదా తాత్కాలికంగా ఆపివేయడం అలాంటి చర్యలలో ఒకటై వుండి తీరాలని మా అభిప్రాయం అన్నారు సోవియట్ ప్రతినిధి.

పాటవ పరీక్షల సమస్య ఇతర నిరాయుధీకరణ సమస్యల మొత్తం పథకంనుండి వేరు చేయబడి, వెంటనే విడిగా పరిష్కరించబడాలని మేము భావిస్తున్నాము అన్నారు జోరిన్.

ఏ రకపు అణు, హైడ్రోజన్ ఆయుధాలనైనా వినియోగించబోమని రాజ్యాలు ప్రతిన తీసుకోవాలని కూడా సోవియట్ దేశం ప్రతిపాదించింది అన్నారు జోరిన్. ఈ విధమైన బాధ్యత తీసుకోవడం గురించి, సోవియట్ ప్రభుత్వం ప్రతిపాదించిన ముసాయిదా ప్రకటనలో వుంది. అణు హైడ్రోజన్ ఆయుధాల నిషేధం, ముఖ్యంగా, అది అణ్వాయుధాల ఉత్పత్తిని అంతం చేయడానికి, అణుయుద్ధ ప్రమాదాన్ని తగ్గించడానికి తోడ్పడగల ప్రస్తుత సమయంలో అత్యంత ముఖ్యమైనది.

అణ్వాయుధ విసర్జన రంగంలో పైన తెల్పిన రెండు చర్యలూ, సోవియట్ దేశ అభిప్రాయంలో, ఒక పాక్షిక ఒడంబడిక చేసుకోడానికి, కనీసం అవసరమని జోరిన్ ఉద్ఘాటించారు. ఈ చర్యలను అమలు జరపడంవల్ల, అణ్వాయుధాలను కలిగివున్న రాజ్యాలు అణుయుద్ధ ప్రమాదాన్ని తొలగించడానికి ప్రత్యక్ష చర్యలు తీసుకుంటున్నాయని సమస్త ప్రజలకు వెల్లడవుతుంది.

అమెరికా, సోవియట్ దేశం, చైనాల సాయుధబలాలు ఒక్కొక్కటీ పదినుండి పదిహేను లక్షల మందికీ, గ్రేట్ బ్రిటన్, ఫ్రాంసు దేశాల సాయుధబలాలు ఒక్కొక్కటీ 650,000 మందికీ తగ్గించడానికై ప్రథమ చర్యగా అమెరికా, సోవియట్ దేశం, చైనాల సాయుధబలాలు ఒక్కొక్కటీ 25 లక్షల మందికీ, గ్రేట్ బ్రిటన్, ఫ్రాంసుల సాయుధ బలాలు ఒక్కొక్కటీ 750,000 మందికీ మొదట తగ్గించబడాలని కూడా సోవియట్ ప్రతిపాదనలలో వుంది అన్నారు జోరిన్. అదే సమయంలో, సోవియట్ దేశంయొక్క ప్రత్యేక క్షేత్ర స్థానంవల్ల—అంటే విశాల భూభాగమూ, సుదీర్ఘమైన సరిహద్దులూ, సోవియట్ దేశానికి వ్యతిరేకంగా ఉద్దేశించబడిన సైనిక స్థావరాలూ సైనిక కూటాలు దాని సరిహద్దులకు సమీపంలో వుండడమూ వల్ల—25 లక్షల మంది వుండాలని చెప్పబడిన సోవియట్ యూనియన్ అమెరికాల సాయుధబలాలు సమానంగా వుండడానికి, అదే సమయంలో, అమెరికా, దాని భాగస్వాములూ యింతకు మునుపు సూచించినట్లుగా, తరవాత యీ రాజ్యాల సాయుధ బలాలు పదినుండి పదిహేను లక్షల మందికి తగ్గించడానికి బాధ్యత తీసుకోబడక పోయినట్లయితే సోవియట్ దేశం అంగీకరించజాలదని కూడా జోరిన్ ఉద్ఘాటించారు.

సాయుధ బలాల తగ్గింపుతోబాటుగా, ఆయుధాల, సైనిక ఖర్చుల తగ్గింపుకూడా తీసుకోవలసిన బాధ్యతలు పాక్షిక ఒడంబడికలో వుండాలని సోవియట్ ప్రభుత్వం ప్రతిపాదిస్తూంది. ప్రథమ చర్యగా సాంప్రదాయిక ఆయుధాలూ, సైనిక ఖర్చులూ యిప్పుడు అమెరికా సూచిస్తున్నట్లుగా నూటికి పదివంతులు కాకుండా, నూటికి 15 వంతులు తగ్గించడం, ముమ్మందు అవి మరింతగా తగ్గించబడాలనే దృష్టితో, అవసరమని సోవియట్ ప్రభుత్వం భావిస్తూంది అన్నారు జోరిన్.

ఇతర దేశాల భూభాగాలపై గల సైనిక స్థావరాలను రద్దు చేయడమూ, అక్కడ వుంచబడిన అణ్వాయుధాలతో కూడిన దళాలను ఉపసంహరించడం విషయానికీ, జర్మనీలో వుంచబడిన నాలుగు రాజ్యాల సాయుధ బలాలనూ, వార్సా సంధి దేశాలలో వుంచబడిన సోవియట్ దేశ సాయుధబలాలనూ, నాటో దేశాలలో ఉంచబడిన అమెరికా, బ్రిటన్, ఫ్రాంసుల సాయుధబలాలనూ తగ్గించడానికి చర్యలను తీసుకోవడం విషయానికీ సోవియట్ ప్రతిపాదనలలో ఒక ముఖ్యస్థానముంది.

జర్మనీ భూభాగంమీద అణ్వాయుధాలుంచకూడదని పాశ్చాత్య రాజ్యాల ప్రభుత్వాలతో ఒప్పందానికి రావడానికి తాను యిష్టపడుతూందని సోవియట్ ప్రభుత్వం కొద్దిరోజుల క్రితం ప్రకటించింది. ఈ సమస్యలన్నింటిపై ఒడంబడిక జరిగినట్లయితే యూరప్‌లోనూ, ప్రపంచములోనూ పరిస్థితి బాగుపడుతుంది. రాజ్యాల మధ్య సంబంధాలలో విశ్వాస వాతావరణం ఏర్పడుతుంది. యూరప్‌లో ఒక సమిష్టి భద్రతా వ్యవస్థను నెలకొల్పాలనే దృష్టి ఎక్కువవుతుంది. ఇది సకలదేశాల ప్రయోజనాలకు అనుగుణ్యంగా వుంటుంది అన్నారు సోవియట్ ప్రతినిధి.

సోవియట్ ప్రతిపాదనలు తగు అంతర్జాతీయ అజమాయిషీని కూడా సూచిస్తున్నాయి. భద్రతా సంఘం పరిధిలో ఒక అజమాయిషీ సంస్థను నెలకొల్పడం గురించి ఒప్పందానికి రావడమూ, హఠాత్తుగా దాడి జరగకుండా నిరోధించడానికి అజమాయిషీ కేంద్రాలు నెలకొల్పడమూ అవసరమని సోవియట్ దేశం భావిస్తూంది అన్నారు జోరిన్. సోవియట్ దేశపు పశ్చిమ సరిహద్దు ప్రాంతాలలోనూ, అమెరికా యొక్క తూర్పు భాగంలోనూ, నాటోలో సభ్యులైన దేశాల భూభాగాలమీదనూ వార్సాసంధి దేశాలలోనూ, విమానాల మీద నుండి ఫోటోలు తీయబడే ప్రాంతాలలోనూ అజమాయిషీ కేంద్రాలు నెలకొల్పబడాలని

(మిగత 26వ పుటలో)

# రయిన్ అధ్యక్ష నివేదిక



లెనిన్ సమిష్టిక్షేత్ర గ్రామదృశ్యం

ఒర్జొనికిడ్జెబాద్‌లోని లెనిన్ సమిష్టి క్షేత్రానికి వెళ్దాం పదండి. వారు తమ వార్షిక నివేదికను సమర్పిస్తున్నారు. అది మీ అవసరానికి సరిపోతుంది కదూ?" అన్నాడు నా స్నేహితుడు.

1949 లో ప్రచురింపబడిన "షోదీ" అన్న నా నవలను పూర్తి చేయడానికి అదనపు భోగట్టాను సేకరించడం, నా అవసరం. పాత పద్ధతులను పట్టుకుని వేలాడేవారికి వ్యతిరేకంగా సుఖమైన, సమృద్ధమైన జీవితం కొరకు గ్రామాల్లోని రైతులు పోరాడుతోన్న ఆ కష్ట కాలంలో, అంటే పందొమ్మిది వందల ముప్పయి ప్రాంతం మొదట్లో సమిష్టి క్షేత్రాల నిర్మాణానికి తీసుకోబడిన మొదటి చర్యల గురించి యిందులో వ్రాయబడింది. అప్పటికీ యిప్పటికి చాలా మారిపోయింది. ప్రస్తుత ముద్రణకొరకు నా పుస్తకాన్ని తిప్పి వ్రాస్తూ, కొత్త భోగట్టాను దానికి చేర్చాలనుకున్నాను. అందువల్లనే నేను నా స్నేహితుణ్ని అడిగాను, ఒక సమిష్టి క్షేత్రానికి తీసుకవెళ్ళమని. ఈ రోజుల్లో అక్కడ ఎలా ప్రజలుంటున్నారో, పని చేస్తున్నారో చూడడానికి వీలు కలుగుతుందిగదా యిందువల్ల. మరింకేమీ గొడవ లేకుండా నా స్నేహితుడు ఒకస్థలాన్ని ఎంపిక చేశాడు.

ఒర్జొనికిడ్జెబాద్ వేపుకు విశాలమైన సిమెంట్ రోడ్డుమీద మా కారు పోతోంటే ప్రయాణం మొదట్లో కాస్త మాటాడిన నేమూ, నా స్నేహితుడు పరవశులమై ప్రకృతి దృశ్యాన్ని చూస్తున్నాము. తజికిస్తాన్ ముఖ్య పట్టణం స్టాలినాబాద్‌కూ, ఒర్జొనికిడ్జెబాద్‌కూ మధ్య దూరం యిరవైనాలుగు కిలోమీటర్లు. ఈ జిల్లా, యీ రిపబ్లిక్కులో గత సంవత్సరం అన్నిటి కంటె ఎక్కువగా పత్తిని పండించింది. తజికిస్తాన్లోని చాలాచక్కని, సంస్కృతీవంతమూ, భాగ్యవంతమూ అయిన జిల్లాలలో ఒకటిగా యిది పరిగణింపబడుతోంది. ద్యుషంబె నుండి (యిప్పటి స్టాలినాబాద్) యాంగి-బజార్‌కు (యిప్పటి ఒర్జొనికిడ్జెబాద్) 24 ఏళ్ళ క్రితం వెళ్ళాలంటే చాలా కష్టంమీద దూరప్రయాణం చేయవలసి వచ్చేది. అటువేపు వెళ్ళడానికి ఒక్క మంచి రోడ్డయినా వుండేదికాదు ఆ రోజుల్లో. దొంగలు, వన్యమృగాలూ కష్టమైన కొండదారుల్లోనూ, బురద నేలలమీదా, డొంకలవద్దా అడుగడుగుకూ ప్రయాణీకునికి అడ్డు తగిలేవి. గత పాతికేళ్ళలో వన్యమానవులూ, వన్యమృగాలే కాకుండా వన్యభూమికూడా పూర్తిగా మారిపోయింది. ఈ ప్రాంతాలలో సాగుక్రింది కి తీసుకరాని భూమి ఒక్క అంగుళమైనా లేదు.

సాఫీగా వున్న రోడ్డుమీద కారు దూసుకుంటూ పోతోంది. ఇరుప్రక్కలా పత్తితోటలు వ్యాపించి వున్నాయి. ప్రస్తుతం పంటలేదు. సమిష్టిక్షేత్రపు పత్తిరైతులు మురికి గుంటలను శుభ్రపర్చుతున్నారు. ఎరువులను తయారుచేస్తూ, వాటిని పొలాల గట్లవద్ద కుప్పలు పోస్తున్నారు. మేము మెషీన్ ట్రాక్టరు స్టేషన్‌మీదుగా పోతోంటే, ప్రతిచోట వసంతకాలపు విత్తనాల నాట్లు సాగుతూ వుండడం చూశాము. ఒక షెడ్డులో వరుసగా మరమ్మత్తు చేసిన ట్రాక్టర్లున్నాయి. ఇంకోదానిలో ప్రతిరకానికీ చెందిన చాలా వ్యవసాయ యంత్రాలున్నాయి. సమిష్టి

రైతుల పనికి తోడ్పడానికి కొద్ది రోజుల్లో అవన్నీ పొలాలలోనికి పంపివేయ బడతాయి.

నా నవలా కాలంలో, యీ ప్రదేశంలో యిందుకు పూర్తిగా భిన్నమైన పరిస్థితులుండేవి. కొత్తగా ఏర్పరుపబడిన సమిష్టిక్షేత్రాలు చాలా బలహీనంగానూ, పేదగానూ వుండేవి. చెప్పుకోవలసిన యంత్రాలుగాని, పరికరాలుగాని వాటికి లేవు. మెషిన్ ట్రాక్టరు స్టేషన్లు యింకా బాగా ఏర్పాటు కాలేదు. కష్టకాలమది; సమిష్టి క్షేత్రాలు నిలవ దొక్కుకుని పేదరైతుల పరిస్థితులనూ, పనినీ బాగుపర్చగలవా అనీ చాలా మందికి అనుమానాలుండేవి.

నా "షోడీ" అన్న నవలలో దీనినంతట్నీ నేను వర్ణించాను. అవును, అప్పుడు అనుమానా లుండేవి, నిజమైన అనుమానా లుండేవి. కాని



చాలకాలం క్రితమే అవి మాయమయ్యాయి. నేటి మా యువతీ యువకులు సిరిసంపదలు గల సమిష్టిక్షేత్రాలలో పుట్టారు. పూర్వపు కష్టాల గురించి వారికి తెలియదు. అందువల్ల తమకు నేడున్న సదుపాయాలను బాగా అవగాహన చేసుకోలేరు.

ఒక అరగంట తరవాత మేము అందమైన సమిష్టి క్షేత్రపు బోర్డు భవనానికి వచ్చాము. ఇది యిటీవలే నిర్మింపబడినట్టుగా కనిపిస్తోంది. మాకు అధ్యక్షుడు రయిస్ రాజబ్ ఇస్మయిలోవ్ స్వాగతం యిచ్చారు (ఇప్పుడు రయిస్ అన్న మాట సమిష్టిక్షేత్రాల అధ్యక్షులకు వాడుక చేయ బడుతోంది).

"దయ చేయండి, దయ చేయండి" అని రయిస్ పలకరించారు, చిరునవ్వుతో. "మీరు మమ్మల్నెరగరు, కాని మేము మిమ్మల్ని బాగా ఎరుగుదుము. మేము మీ పుస్తకాలు చదివాము."

ఆయన చూపిన ఆదరం ఎంతో హృదయంగమంగా వుంది.

"నేను కూడా మిమ్మల్నెరుగుదుము" అన్నాను నేను. "మిమ్మల్నందరూ ఎరుగుదురు. మీరు సామ్యవాద శ్రమవీర బిరుదును పొందారు. అదేమీ మాటలుకాదు. నా హృదయపూర్వకాభినందనలు."

క్షేత్రం బోర్డు కార్యాలయానికి క్లబ్బుకు యెంతో దూరంలేదు. గుంపులు గుంపులుగా జనం అక్కడ నిల్చొని వున్నారు. సెలవురోజు గనక బాగా ముస్తాబయి వాళ్లున్నారు. ఆ చౌకుకు రెండుపేపులా బళ్ళలో వున్న దుకాణా

## జలాల్ ఇక్రామీ
### తజిక్ రచయిత

లున్నాయి. కొన్నిటిలో బట్టలూ, బూట్లూ, రేడియో సెట్లు, చిన్నగ్రామొఫోన్లు మొదలైనవి వున్నాయి. తక్కినవాట్లో పంచదార, నబత్ తీపివస్తువులూ, మిఠాయి, బిసుకొత్తులు, ఖల్వా, వెన్న, డబ్బాలలో నిలవచేసిన పదార్థాలూ వున్నాయి. టీ దుకాణంలో పెద్దపెద్ద కర్రబెంచీ లున్నాయి, తివాసీలు కప్పి. ఇవన్నీ సమిష్టి రైతులతో నిండిపోయాయి. వ్యాపారం జోరుగా సాగుతోంది.

నాకో సంగతి చెప్పారు, అదే తరవాత రయిస్ నివేదికద్వారా తెలుసుకున్నాను. ఏమి

లెనిన్ సమిష్టి క్షేత్రపు ఒక సమావేశంలో "సమిష్టి క్షేత్రపు బోర్డు కృషి సంతృప్తికరంగావున్నది" అన్న తీర్మానం వోటుకు పెట్టబడింది

టంటే — 1956 లో యీ క్షేత్రానికి గోధుమ వేసినభూమి 1013 హెక్టార్లు. పత్తి వేసినది 837 హెక్టార్లు. కాయగూరలకు 20 హెక్టార్లు. పళ్ళచెట్లకు 16 హెక్టార్లు వుండేవి. ఈ సమిష్టి క్షేత్రంలో చాలా గ్రామాలున్నాయి. వాటి మొత్తం జనాభా ఆరువేలు. గత ఏడాది కృషికి ఫలితంగా రైతులకు గొప్ప బహుమానం వచ్చింది. రయిస్ ఇస్మాయిల్‌కు సామ్యవాద శ్రమవీర బిరుదం వచ్చింది; దళనాయకులకూ, ఉత్తమ కర్షకులకూ యోగ్యతా పత్రాలూ, పతకాలూ వచ్చాయి.

సమావేశం చాలా గంభీరంగా జరుగుతుందనీ, క్షేత్రం సంపాదించిన విజయాలు పేర్కొనబడి, అదేపనిగా ప్రశంసింప బడతాయనీ నా నమ్మకం. కాని నా పుస్తకానికి కావలసింది ఇంకొకటి — క్షేత్రం అవసరాలూ, దాని ప్రస్తుత కష్టాలూ; అప్పుడే జిల్లా సంఘాల అధిపతులు రావడం మొదలు పెట్టారు — జిల్లా కార్యనిర్వాహక అధ్యక్షుడు, జిల్లా పార్టీ కార్యదర్శి మెషిన్‌ట్రాక్టరు స్టేషన్ డైరెక్టరు మొదలైనవారు.

సమావేశం కోసం అందరూ క్లబ్బులోనికి ఆహ్వానింపబడ్డారు. మిగతావారితో మేమూ వెళ్ళాము. నాలుగైదు వందలమందికి సరిపడేటట్టుగా క్లబ్బు నిర్మింపబడింది. కాని ఎనిమిది వందలమందికి తక్కువకాకుండా దాన్లో కిక్కిరిసిపోయారు. అన్నికుర్చీలూ, దారుల్లోని జాగాలూ, కిటికీలూ, తలుపులదగ్గర స్థలాలూ నిండిపోయాయి. పిల్లలుకూడా హాలులోనికి దూరిపోయారు. కాని వాళ్ళను తొందరగా బయటికి పంపించేశారు. కళాప్రదర్శనలు మొదలు కాగానే వాళ్ళను పిలుస్తామని చెప్పి.

సమావేశం మొదలైంది. రయిస్ ఇస్మాయిల్ క్షేత్రదళాలన్నిటి ప్రతినిధులకూ క్షేత్రం కృషి గురించి తన వార్షిక నివేదికను చదవడం మొదలుపెట్టాడు. ఈ ప్రతినిధులు యీ సమావేశంలోనే ఎన్నుకోబడినవారు. నాక్కావలసిన దల్లా వ్రాసుకోవడానికి నేను నా నోటుపుస్తకాన్ని సిద్ధంగా పెట్టుకున్నాను.

రాజబోవ్ దళంలోని పత్తిరైతులు 71 హెక్టార్లలో హెక్టారు ఒక్కంటికి 50.3 మెట్రిక్ సెంట్నార్ల పత్తికి తక్కువ కాకుండా పండించారు; అఫగాన్ దళం 48 మెట్రిక్ సెంట్నార్ల పత్తిని పండించింది. ఆలీవాదళం — స్త్రీ నాయకత్వంగల దళం యిదొక్కటే — హెక్టారుకు 43 మెట్రిక్ సెంట్నార్ల పత్తిని పండించింది.

క్షేత్రానికి సంవత్సరానికి 11,784 000 ఆదాయం వచ్చింది. అంటే ఒకొక్క పని రోజుకూ (పని మానం) రైతులకు డబ్బు రూపంలో 12 రూబుళ్ళు, రెండు కిలోగ్రాముల ధాన్యమూ వస్తుందన్నమాట. అగ్రగాములైన కర్షకులు ఒకొక్కరూ 400, అంతకు పైగా కూడా పనిరోజులు సంపాదించారు.

అనాధబాలలకూ, వృద్ధులకూ 13 వేల రూబుళ్ళూ, 7 700 కిలోగ్రాముల ధాన్యమూ కేటాయింపబడ్డాయి.

క్షేత్రానికి స్వంత సెంకడరీ పాఠశాల, అనేక సప్తవర్ష పాఠశాలలూ, 2500పుస్తకాలు గల ఒక గ్రంథాలయమూ, ఒక ఆసుపత్రి, బాలోద్యానవనమూ, శిశుపోషణాలయమూ ఉన్నాయి....

ఇవీ సాధించిన విజయాలు. ఇక రయిస్ లోపాల గురించి చెప్పడం మొదలుపెట్టారు. పత్తి సాగులో క్షేత్రం చాలాబాగా కృషిచేసింది కాని పశుప్రజననం, ధాన్యంపంట, సిల్కు పురుగు పెంపకం విషయంలో క్షేత్రం తన పథకాన్ని నెరవేర్చలేదు. నీరులేని భూమిమీద పనిచేసిన దళాలు, సగటుగా హెక్టారుకు రెండున్నర సెంట్నార్ల ధాన్యాన్ని పండించాయి. ఆవులపట్ల శ్రద్ధ తీసుకోకపోవడంవల్ల పాలు తగ్గిపోయాయి. గత ఏడాదితో పోల్చితే గొర్రెలలో 321 తగ్గిపోయాయి.

ఇందుకు నిందలో ఎక్కువ భాగం క్షేత్రం బోర్డుకు చెందుతుందనీ, కొంతభాగం దళనాయకులదికూడాననీ అన్నారు రయిస్.

చర్చ మొదలయ్యాక నా అనుమానాలు పూర్తిగా తొలగిపోయాయి. రైతులకూ, దళనాయకులకూ ఆత్మప్రశంస చేసుకునే ఉద్దేశం లేదు. తమపనిలోని లోపాలన్నిట్నీ వెల్లడి చేసి, అందుకు కారణాలను అన్వేషించడానికి వారు పూనుకున్నారు. సమిష్టి క్షేత్రాధిపతులకూ, జిల్లాసంఘాల, మెషిన్ ట్రాక్టరు స్టేషన్ల అధిపతులకూ వారు అడుగులకు మడుగులొత్తుతూ వుండరు. ఉపన్యాసకుల తీవ్రతనుబట్టి చూస్తే జిల్లాఅంతట్లో తాము ఉత్తమ కర్షకులుగాని అధమ కర్షకులు కాదన్న విషయాన్ని వారి మరిచిపోయారా అని నాకు ఆశ్చర్యం వేసింది.

మెషిన్ ట్రాక్టరు స్టేషన్ డైరెక్టరు కామ్రేడ్ ఎరోవ్ తన శక్తినంతట్నీ పత్తి పెంపకంమీద కేంద్రీకరించి, ధాన్యం రైతులనూ, పశు ప్రజననకారులనూ వాళ్ళ కర్మానికి వాళ్లను వదిలి వేశారని ఒకరు చెప్పారు.... గడ్డి సేకరణకోసం పశు ప్రజననకారులు తమ పశువుల మందలను వదిలిపెట్టేశారని, తత్ఫలితంగా శీతకాలం కోసం తయారుచేసిన గడ్డిలో చాలా భాగాన్ని పశువులు తినివేశాయనీ యింకొకరు నిందించారు.... క్షేత్రంలో ఎన్నో సద్గుణాలున్నప్పటికీ, లోపాలగురించి మాత్రమే మాటాడేరు. వార్షిక నివేదిక సమావేశం యిందుకు ఉచితమైన సమయమనీ, అందువల్ల యికమీదట తమ పని సాఫీగా సాగిపోతుందనీ వారి పద్ధతిని అవలంబించినట్టుంది. ఒక ఉపన్యాసకుడు సకాలంలో కోయనటువంటి నారగురించీ, పొలాల్లో వుండిపోయి కుళ్ళిపోయిన అనేక హెక్టార్ల గోధుమ పంట గురించీ, తరవాత నది గొడ్లకు వేయడం కోసం కోయబడడంగురించీ ప్రసంగించారు.... బాగా పనిచేయనందుకు యింకొకరు ధాన్యం రైతులను నిందించారు, వారు పత్తి రైతులు తెచ్చిన ఆదాయంపైని బ్రతుకుతున్నారన్నారు. పత్తి రైతుల్లాగనే వారుకూడా కష్టించి పనిచేసి వున్నట్టయితే, వారు బాగా పండించివుండేవారన్నారు.

"మన క్షేత్రం పూనిక మానకూడదు" అని చెప్పాడు తేనెటీగలను పెంచే ముసలాయన ముఖిద్దీన్ ఖిత్మతోవ్. "ప్రతి సామాన్య సమిష్టి కర్షకుడూ శ్రమవీరుడవడానికి ప్రయత్నించాలి. మనం ప్రతి ఒక్కరం మాస్కోకు వెళ్ళి, క్రెమ్లిన్‌లో ప్రవేశించి, మనపార్టీ, ప్రభుత్వాల నాయకులతో మాట్లాడి, వీరస్వర్ణ పతకాన్నీ, ఆర్డర్ ఆఫ్ లెనిన్‌ను కామ్రేడ్ వారొషిలోవ్ చేతులనుండే తీసుకోవాలి!"

ఈ ఉద్రేకపూరితమైన, మనఃపూర్వకమైన ప్రసంగాలన్నీ విన్నాక నా మిత్రునితో యిలా చెప్పాను:

"ఈ సమావేశం యిలా వుంటుందని నేను యెన్నడూ ఊహించలేదు. విజయాలతో వీరికి తలలు తిరిగిపోలేదు, నిజం. చిన్న విజయాలతో వీరు సంతృప్తి పడటంలేదు."

మళ్ళీ యీ క్షేత్రానికి వచ్చి, వారి పరిచయం చేసుకోవాలనుకున్నాను. వారి గురించి ఇంకా నాకు అట్టే తెలియదు....

"నిన్ను యిక్కడికి తీసుకవచ్చినందుకు నాకు కృతజ్ఞత చెప్పు. ఒకేసారి నీకు యిన్ని విషయాలు ఎక్కడ తెలుస్తాయి?" అన్నాడు నా మిత్రుడు చిరునవ్వుతూ.

మేము తిరిగి యింటికి వచ్చేటప్పటికి చీకటి పడింది. కాని త్రోవ చాలా విశాలంగా, ప్రకాశవంతంగా వుంది....



# మీ రాకకై మాస్కో నిరీక్షణ

37 క్రొపాత్కిన్ వీధి, మాస్కో. దానిలో, అనేక అంతస్తులుగల మేడలో ఆరవ ప్రపంచ యువజన విద్యార్థి ఉత్సవ అంతర్జాతీయ సన్నాహ సంఘ ప్రధాన కార్యాలయం వుంది. ఈ సంఘంలో సోవియట్ యువజన ప్రతినిధులు బ్రిటన్, బల్గేరియా, డెన్మార్క్, ఇండియా, ఇరాన్, ఇటలీ, పోలెండ్, ఫ్రాన్సు మొదలైన దేశాల యువజన సంఘాల ప్రతినిధులతో కలిసి పనిచేస్తారు.

ముఖ్యంగా యీ రోజులు సంఘ సభ్యులకు గడ్డురోజులు. ప్రపంచం నలుమూలలనుండీ వారిమీద ఉత్తరాలు కుప్పతిప్పలుగా వచ్చి పడుతున్నాయి; చూడడానికి వచ్చేవాళ్ళు వారిని చుట్టుముట్టుతున్నారు.

ఇటీవల "సోవియట్ భూమి" విలేకరి యీ సంఘ కార్యాలయానికి వెళ్లారు; ఉత్సవంలో పాల్గొనడానికి గల షరతుల గురించి మా యువపాఠకులకు తెలుసుకోవాలనే కుతూహలం వుండడంవల్ల, ఆ సమాచారాన్ని సేకరించేందు కాయన వెళ్లారు.

*"ఉత్సవానికి ఏ సంఘాలు తమ ప్రతినిధులను పంపించవచ్చును?"* అన్నది అయన వేసిన *తొలి ప్రశ్న.*

"ఉత్సవానికి ఎవరు రాకూడదో చెప్పడం తేలికగా వుంటుంది; ఎందుచేతనంటే—యువజన సంఘాలన్నిటికీ ప్రవేశార్హత వుంది. దాని గురించి అంతర్జాతీయ సన్నాహ సంఘ ప్రకటనలో యిలా వుంది: 'విశ్వాసాలూ, తెగ, మతం, జాతి ప్రసక్తిలేకుండా యువజను లందరూ యీ ఉత్సవంలో పాల్గొన వచ్చునని మేము ప్రకటిస్తున్నాము. పరస్పర గౌరవం, పరస్పర అవగాహన భావంతోనూ, అంతర్జాతీయ యువజన మైత్రీ భావంతోనూ, జరిగే ఈ ఉత్సవంలో ఏ రాజకీయ, తాత్త్వికమత ధోరణులూ వుండవు.' " అని ఆయనకు చెప్పారు.

*"ఏఏ దేశాలు పాల్గొంటున్నాయి?"*

"ఓహో, మళ్ళీ చిక్కు ప్రశ్నే వచ్చిందే. తమ ప్రతినిధులను పంపించబోయే 140 దేశాలనూ పేర్కొనడానికి చాలాకాలం పడుతుంది."

*"ఈ ఉత్సవంలో పాల్గొనేవారు ఏఏ ఖర్చులు భరించాలి?"*

"అంతర్జాతీయ నిర్వాహక సంఘ నిర్ణయాను సారంగా, ఉత్సవంలో పాల్గొనే ప్రతిఒక్కడూ ఉత్సవంలో తాను వుండే ప్రతి ఒక్క రోజుకూ రెండు అమెరికన్ డాలర్లనుగాని, యింకే ద్రవ్యంలోనైనా దానికి సమానమైన మొత్తాన్నిగాని చెల్లించాలి. భోజనానికీ, వసతికీ అయ్యే ఖర్చులకోసం సౌకర్యాలు, మాస్కోలో ప్రయాణాలు, ఉత్సవ కార్యక్రమంలోని ప్రదర్శనలు మొదలైన వాటికి పోవడానికీ యీ డబ్బు అవసరం. ప్రయాణపు ఖర్చులను పాల్గొనేవారే భరించాలి."

*"అయితే యిది బహుశా చాలా పెద్ద మొత్త మవుతుందనుకుంటానే, ముఖ్యంగా దూరాభారాల నుండి వచ్చేవారికి?"*

"అవును. అందువల్ల ప్రతినిధుల మాస్కో యాత్ర కోసం ప్రతిచోటా వసూళ్ళు జరుగుతున్నాయి. యువజనులు వేలాలూ, లాటరీలూ, ప్రదర్శనలూ, చెల్లింపు పద్ధతిపైని సాయంకాలపు విందులూ, సంగీత కచేరీలూ జరుపుతారు; బాడ్జీలూ, సోవెనీర్లూ, స్టాంపులూ అమ్ముతారు, చందాలు వసూలు చేస్తారు. వలస, పరాధీన దేశాల యువజనుల పరిస్థితి కష్టంగా వుందని గుర్తించి, అంతర్జాతీయ సన్నాహ సంఘం ప్రపంచ ఉత్సవనిధినుండి సాధ్యమయిన సహాయాన్ని యివ్వడానికి నిర్ణయించింది."

*"ఈ నిధి గురించి సవివరంగా చెప్తారా?"*

"వలస, పరాధీన దేశాల యువజనులకు, ఆర్థిక యిబ్బందులుగల దేశాలన్నిటికీ చెందిన ప్రతినిధులకు ఆర్థిక సహాయం చేసేందుకు, చాలా దేశాల యువజన సంఘాల సూచనపైని యీ నిధి యేర్పాటు చేయబడింది. ఈ సంఘీభావనిధి, సంఘాలూ, వ్యక్తులూ యిచ్చిన నిధులతో ఏర్పడింది. ఉదాహరణకు ఆస్ట్రియన్ యువజనులు ఐవరీ కోస్ట్‌లోని తమ మిత్రులకోసం 40 వేల షిల్లింగులను వసూలు చేయడానికి నిర్ణయించు కున్నారు. చెకోస్లొవేకియా యువతీయువకులు ఉత్సవనిధికి, తమనెల ఆదాయాల్లో నూటికి ఒకటి రెండు వంతులు యివ్వడానికి నిర్ణయం చేశారు. స్విస్ ఉత్సవ సంఘం చేసిన విజ్ఞప్తిపైని స్విట్జర్లాండ్ యువజనులు నైజీరియా, గువడెలోప్ ప్రతినిధులకు సహాయం చేయడానికి ఉత్సవపు రుమాళ్లనూ, బాడ్జీలను అమ్ముతారు"

*"యధేచ్ఛగా ఉత్సవానికి రావచ్చునా?"*

"అన్నిటికంటె ప్రధానంగా కావలసిందే అది. ఇందుకోసం తమ జాతీయ ఉత్సవ సన్నాహ సంఘానికి దరఖాస్తు పెట్టుకోవడం అవసరం. ఇప్పటికే 92 దేశాలలో ఉపసంఘాలు ఏర్పడ్డాయి. ఇంకా సన్నాహ సంఘాలు ఏర్పడని దేశాల్లో, ఉత్సవానికి జాతీయ ప్రతినిధి వర్గాలను ఏర్పరిచే యువజన సంఘాలకు దరఖాస్తులుపెట్టాలి.

"ఉత్సవంలో పాల్గొనేవారు చేరవలసిన తేదీని బహుశా తెలుసుకొనగోరుతూ వుండవచ్చును కూడా. ఉత్సవం జులై 28 నుండి ఆగస్టు 11 వరకూ జరుగుతుంది. అంతర్జాతీయ నిర్వాహక సంఘానికి చెందిన స్థాయీ సంఘం, ప్రారంభ దినానికి రెండు మూడు రోజులు ముందుగా మాస్కోకు చేరాలనీ, లేదా కనీసం ఆలస్యం చేయవద్దనీ జాతీయ సలహా సంఘాలకు సలహానిస్తోంది. ప్రియమైన అతిథుల కోసం మాస్కో ఎదురుచూస్తోంది."





సోవియట్ దేశ సుప్రీం సోవియట్ అధ్యక్ష వర్గ
సభాపతి కె. ఇ. వొరొషిలోవ్, చైనా ప్రజా రిపబ్లిక్
అధ్యక్షుడు మావ్ సె-తుంగ్ ఆహ్వానం పైని చైనాకు
వెళ్ళారు. వొరొషిలోవ్ చైనాలో మూడువారాలున్నారు,
చాలా చోట్లకు వెళ్ళారు, సోదర చైనా ప్రజలను
స్వయంగా పరిచయం చేసుకున్నారు, వారి స్వార్థరహిత
కృషినీ, నూతన సోషలిస్టు జీవన నిర్మాణంలో సాధ



కె. ఇ. వొరొషిలోవ్‌కు విమానాశ్రయం దగ్గర, ఏప్రిల్ 15న,
అధ్యక్షుడు మావ్ సె-తుంగ్ అభివందనం చేస్తూ



పెకింగ్ యువజనులు విమానాశ్రయం దగ్గర కె. ఇ. వొరొషిలోవ్‌కు
పుష్పగుచ్ఛాలను సమర్పిస్తూ →



పెకింగ్ నగరపు మేయర్ పెంగ్ చెన్, పెకింగ్‌లో జరుపబడిన స్వాగత
సమావేశంలో, కె. ఇ. వొరొషిలోవ్‌కు పతాకను బహూకరిస్తూ →

విమానాశ్రయంనుంచి అతిథి గృహానికి కె. ఇ. వొరొషిలోవ్, మావ్ సె-తుంగ్
కార్లో పోతుండగా హర్షధ్వానాలు చేస్తోన్న ప్రజ.



# వొరొషిలోవ్



సాధించిన అద్భుత విజయాలను తెలుసుకున్నారు. చైనా ప్రజలాయనకు ప్రతిచోటా హృదయ పూర్వకమైన స్వాగతమిచ్చారు.

వొరొషిలోవ్ యాత్ర చైనా, సోవియట్ ప్రజల మహామైత్రిని యింకా పటుతరం చేస్తుంది, మహత్తరమైన ప్రపంచ శాంతి, మానవ ప్రగతి ఆశయాన్ని యింకా ముందుకు తీసుకపోతుంది.



చైనా ప్రజారిపబ్లిక్ ప్రభుత్వమండలి ప్రధాని చౌ ఎన్-లై, ఏప్రిల్ 16న, కె. ఇ. వొరొషిలోవ్ గౌరవార్థం జరిపిన విందులో. ఛాయాచిత్రంలో చౌ ఎన్-లై విందువద్ద కె. ఇ. వొరొషిలోవ్‌కు అభినందనంచేస్తూ.



← ఏప్రిల్ 16న, నేషనల్ పీపుల్సు కాంగ్రెస్ స్థాయీసంఘ సమావేశంలో కె. ఇ. వొరొషిలోవ్ ఉపన్యసించారు.

నేషనల్ పీపుల్సు కాంగ్రెస్ స్థాయీ సంఘాధ్యక్షుడు, వొరొషిలోవ్‌ను అభినందిస్తూ.





# 250 సంవత్సరాల లెనిన్‌గ్రాడ్

లెవ్ ఉస్పెన్‌స్కీ

లెనిన్ గ్రాడ్ నగర మధ్యభాగంలో నేను నివసిస్తున్నాను. నేవానది గట్టువేపున వున్న మా కార్యాలయం కిటికీలోనుంచి చూస్తే యీ మహానగరపు విశాల సుందర దృశ్యం, తన గత అద్భుత చరిత్రకు, భవిష్యత్తులో రానున్న వైభవానికీ అనుగుణంగా కనిపిస్తుంది.

రాతిగట్టు గోడకు సరిగ్గా దిగువను నలుముఖాలు గల సామాన్య మైన ఒక ఉన్నత స్తంభం వుంది. ఇది లెనిన్ గ్రాడ్ పురవాసులకూ, యితర నగరాలనుండి వచ్చేవారికీ, విదేశాలనుండి వచ్చిన అతిథులకు కూడా అభిమాన ప్రదేశంగా కనిపిస్తోంది. ఇది "అరోరా" అన్న యుద్ధనౌకకు స్మృతి చిహ్నం. ఇక్కడనుండే, నేవానది మధ్యలో నుంచి, సరిగ్గా మా కిటికీకి ఎదురుగుండా యీ విప్లవ యుద్ధనౌక ఫిరంగులు, అక్టోబరు తిరుగుబాటు జరిగిన రాత్రివేళను వింటర్ ప్యాలస్ పైని గుళ్లుపేల్చి, మా దేశానికీ, యావత్ప్రపంచానికీ ఎన్నో మార్పులను ప్రాప్తింపజేసిన విప్లవాన్ని ప్రారంభించాయి.

మా కిటికీ తలుపులను యింకా తెరిచినట్టయితే నేవానది నీలపు నీళ్ళు ప్రశాంతంగా కుడినుండి ఎడమకు, పూర్తిగా రెండు ఫర్లాంగుల వెడల్పున ప్రవహిస్తుంటాయి. రేవు ఎడమవేపున వుంది. పెద్దక్రేన్లు గర్జిస్తున్న విండ్‌లాసెస్‌కు పైగా పోతున్నాయి, న్యూమేటిక్ సుత్తెల రొదలు వినిపిస్తున్నాయి, పాలిన ఆకాశంలో ఓడలు రేఖామాత్రంగా కనిపిస్తున్నాయి. కుడివేపున అనంతంగా గృహాలున్నాయి. ఒకొక్కటీ గొప్ప వాస్తుశిల్ప నైపుణ్యాన్ని ప్రదర్శిస్తోంది, నదిపై అలముకొని వున్న మంచుతెరను, పీటర్, పాల్‌దుర్గపు చర్చి గోపురం, అంగారపు కత్తిలాగా 122 మీటర్ల ఎత్తుకు చీల్చుకుని పోతోంది, 1704 సంవత్సరంలో మే నెలలోని ఒక చలిరోజున ఒకటవ పీటర్ చక్రవర్తి నేవా నదిలోని ఒక చిన్న ద్వీపంలో, 258 ఏళ్ళక్రితం యీ దుర్గానికే శంకుస్థాపన చేశాడు. దాంతోనే పీటర్స్‌బర్గ్ నిర్మాణం మొదలైంది. అదే చివరికి లెనిన్ గ్రాడ్ అయింది. కళా పరిషత్తుయొక్క పెద్ద భవనం నది ఆవల ఒడ్డున వుంది, ఇది 18వ శతాబ్దం చివరను నిర్మింపబడింది. ఈ కట్టడానికి యెదురుగుండా వున్న గట్టును రెండు అద్భుతమైన ఈజిప్షియన్ స్ఫినిక్స్‌లు (స్త్రీ ముఖమూ, సింహ శరీరమూగల కల్పిత రాక్షస విగ్రహాలు) అలంకరిస్తున్నాయి.

## భారతీయ భాషల పట్ల గొప్ప ఆసక్తి

నేవా తీరాన యింకా పైకిపోతే నగరంలోని చాలా పురాతనమైన కట్టడాలు కొన్ని కనిపిస్తాయి. అవి ఒకటో పీటర్ చక్రవర్తి సలహాదారుడు, స్నేహితుడూ అయిన మెన్షికోవ్ భవనమూ, "పన్నెండు కొలీజియంల" అద్భుత భవనమూ, పీటర్ చక్రవర్తి మంత్రిత్వ శాఖలూ—యిప్పుడిక్కడ మా విశ్వవిద్యాలయం వుంది, విశ్వ విద్యాలయపు భవనాలు ఎన్నో కిక్కిరిసి వున్నాయి—యిటు వంటివన్నీ వున్నాయి. అందమైన యితర గృహాలలో విశ్వవిద్యాలయపు ప్రాచ్య విద్యాశాఖ కట్టడం కనిపిస్తుంది. ఇది ప్రాచీనమైన ప్రాచ్య విద్యాధ్యయన కేంద్రం, ఇక్కడ ప్రతిరోజూ హిందీ, బెంగాలీ, ఉర్దూ భాషలు వినిపిస్తుంటాయి. ఉపన్యాస మందిరాలు నిర్మానుష్యంగా ఉన్నప్పుడు సాయంత్రపు వేళలలో నల్ల బల్లలమీద దేవనాగరి, అరబిక్ వాక్యాలు కనిపిస్తాయి. భారత దేశంనుండి వచ్చిన హాళ్ళెవ్వరూ

యీ శాఖకు వెళ్ళకుండా వుండరు. భారతదేశం గురించిన విజ్ఞానాన్ని అధ్యయనం చేయడానికి జీవితాలను అంకితం చేసిన రష్యన్ యువజనులు వారికిక్కడ తప్పక కనిపిస్తారు. తమ దేశపు రాజ్యాంగం గురించి తెలిసినంతగా మనుసూత్రాలు తెలిసివున్న యువతులిక్కడ కనిపిస్తారు. రష్యన్ పురాణ గ్రంధాలలోని వీరులు తెలిసివున్నంతగా మహాభారతవీరుల గురించి తెలిసినవారు వీరిలో కనిపిస్తారు. పాండవ కౌరవుల మధ్య వుండిన వైరాలగురించి, మాంటెగ్స్‌కు, కపులెట్స్‌కు మధ్య వుండిన వైరం గురించి తెలిసినంత స్పష్టంగా వారెరుగుదురు.

మా కార్యాలయం కిటికీ గుండా విశ్వవిద్యాలయానికి ఎదురుగుండా వున్న నేవా తీరపు ఎడమ ఒడ్డు—నేనిక్కడ నివసిస్తున్నాను—దురదృష్టవశాత్తు పూర్తిగా కనిపించదు. కాని యిక్కడున్న అతి రమ్యమైన వాస్తుశిల్ప నిర్మాణాలు కనిపిస్తాయి. వాటిలో మొదటిది రాస్ట్రెల్లీ వింటర్ ప్యాలస్. ఇప్పుడు దానిలో హెర్మిటేజ్ కళాప్రదర్శనశాల అపార నిధులున్నాయి. నలభై ఏళ్ళ క్రితంవరకూ రష్యా నిరంకుశ పరిపాలకులలో ఆఖరు వ్యక్తి వుంటూవుండేవాడు. తరవాత అద్భుతమైన ఐజాక్స్ కెథెడ్రల్ వుంది. నూరు మీటర్లు ఎత్తుగల బ్రహ్మాండమైన కట్టడం యిది. దానిది బంగారు శిఖరం. ప్రపంచంలో కల్లా పెద్దవైన 48 స్థంభాలు దానికి చుట్టూరా వున్నాయి. ఒకొక్కటీ నూరు టన్నులుగల ఏకశిలా ఖండం. వాస్తుశిల్పి జఖరోవ్ నిర్మించిన యీ గొప్ప కట్టడాలలోవి యింకొకటి, ఏడు వందల ముప్ఫయి మీటర్ల ముఖతలం గల అడ్మిరాల్టీ భవనం....

మా కార్యాలయపు కిటికీలోనుండి చూస్తే కనిపించని కట్టడం యింకొకటి కూడా వుంది. అది ప్యాలస్ స్క్వేర్‌లోని అలెగ్జాండర్ స్తంభం. ఇది ఏభై మీటర్ల ఎత్తుగల వర్తుల శిలా స్తంభం. ఒకేరాతి నుండి మలచబడిన యీ స్తంభం కొవ్వు ఒత్తిలా నిటారుగా నిలబడి వుంది: తన అపారభారంవల్ల మాత్రమే అది మూలంపైని నిలచి వుంది. ఇదేవిధంగా గోచరం కాకుండా వున్నది ఒకటో పీటర్ చక్రవర్తికి స్మృతిగావున్న సాటిలేని స్మారకచిహ్నం. మహాశిల్పి ఫల్కోనె తయారు చేసిన దిది. "కంచు రౌతు"అన్న అమర కావ్య రచనకు పుష్కిన్‌ను ఉత్తేజపరచినదిదే. నేను ముందు చెప్పినట్టుగా మా కిటికీలోనుండి నగరంలోని ఒక భాగం మాత్రమే కనిపిస్తుంది కాని యీ భాగంకూడా ఎంత మనోజ్ఞంగా వుంటుంది. ముఖ్యంగా శ్వేతరాత్రిలో!

## శ్వేతరాత్రి

శ్వేతరాత్రి! సోవియట్ దేశపు దక్షిణాదివారికి యీ మాటల తాత్పర్యం తెలియక పోవచ్చును. ఉత్తరాదిని లెనిన్‌గ్రాడ్ ఉనికివల్ల వేసవిలోనూ, శీతకాలంలోనూ పగళ్ళకూ రాత్రులకూ పొడవులోగల భేదం చాలా ఎక్కువగా వుంటుంది. జనవరిలో పిల్లలు విద్యుత్కాంతులుండగా బడికి వెళ్ళి, సంధ్యాకాంతులలో యింటికి తిరిగి వస్తారు. కాని వేసవిలో, జూన్ నెలలో సూర్యుడు మూడు నాలుగు గంటలు మాత్రమే అస్తమిస్తాడు. అర్ధరాత్రప్పుడు కూడా పట్టపగటి వెల్తురు పూర్తిగా వుంటుంది. చౌకులలోనూ, నదీతీరాన, నీలిమతో మిళితమైన పల్చని రజత కాంతి మాత్రమే వీటిని ఆవరించి వుంటుంది—బల్లలమీద కూచొని జనం వార్తాపత్రికలను చదువుతూ వుండడమూ, బాలికలు లేఖలు వ్రాస్తూవుండడమూ—బహుశా యిది తమ ప్రియులకు కావొచ్చు—యువకులు తమ ప్రేయసుల మధురాకృతులను చూస్తూ, యీ వింత కాంతిలో తమలో వచ్చిన మార్పుకు ఆశ్చర్యపడడమూ చూడవచ్చును. ప్రకాశవంతమైన తెల్లని ఆకాశంలో ప్రతి ఒక్క గృహమూ స్పష్టంగా, సవివరంగా కానవస్తున్నది. సాయంకాలకాంతి, ప్రభాతము ఒకదానితో ఒకటి లీనమవుతున్నాయి. నేవా నది కరిగించిన టిన్నులాగా తళతళ లాడుతోంది. ఈ శ్వేతరాత్రి, వాస్తవానికి ఉత్తరాది అద్భుతాలలో ఒకటి. ఈ రాత్రి కాంతిలో లెనిన్‌గ్రాడ్ ఒక పెద్ద వాస్తుశిల్ప వస్తుప్రదర్శనశాలేమోనని భ్రమింపచేస్తుంది. ఆ నగరం గురించి అలా తప్పితే, యింకో విధంగా ఎవ్వరూ అనుకోడానికి వీలులేదు. కాని, ఆ భావం పూర్తిగా నిజం కాదు.

## అన్నీ నిజమే!

తమ పట్టణం ఎలా వుందో చెప్పమని లెనిన్‌గ్రాడ్ పౌరులను పదిమందిని అడగండి. వారు పదిమందీ పదిరకాల జబాబు లిస్తారు.

చిత్రకారుడైనా, వాస్తుశిల్పియైనా అది అర్ధరాత్రి అందాల, అద్భుతాల నగరమని, మనోహర గృహాల, రమణీయ వాస్తుశిల్పాల





సెయింట్ ఐజాక్స్ చౌకు

నగరమని చెప్పవచ్చును. కాని యిందుకు నావికుడు "కాదు, కాదు యిది సాగరనగరం, నౌకల నగరం, నౌకానిర్మాతల, నావికుల నగరం" అని చెప్తాడు.

శాస్త్రజ్ఞుడీ మాటలకు ముఖం చిట్లించి, అది తన అభిప్రాయములో విజ్ఞానశాస్త్రానికీ, సకల సంస్థలకూ సంస్థఅయిన ఒక బ్రహ్మాండమైన వైజ్ఞానిక పరిషత్తుకూ నిలయమంటాడు.

లెనిన్‌గ్రాడ్‌లోని సామాన్య కార్మికుడు కూడా తన అసమ్మతిని ప్రకటిస్తాడు, దానిని అతను కార్మిక నగరంగా, అతి ప్రాచీనమైన చాలా పెద్దవైన పరిశ్రమల కర్మాగారాల సమీకృత శక్తిగా, నిర్మిస్తూ, నేతనేస్తూ, నవకల్పనచేస్తూవున్న ఒక బ్రహ్మాండమైన కర్మాగారంగా పరిగణించడంవల్ల అది యిటువంటి నగరమంటాడతను.

చివరికి వాళ్ళందరూ లెనిన్‌గ్రాడ్ విప్లవ జన్మ స్థానమనీ మహత్తరమైన లెనిన్ పార్టీ పుట్టి పెరిగిన నగరమనీ, ప్రఖ్యాతమైన సెయింట్ పీటర్స్‌బర్గ్ కార్మికవర్గం ఉవ్వెత్తుగలేచి, సర్వ ప్రపంచ సౌఖ్యంకొరకు, కమ్యూనిజం కొరకు 1917లో మహత్తర పోరాటాన్ని మొదలు పెట్టేందుకు తొలిసారిగా పూనుకున్న ప్రదేశమనీ ఉద్ఘాటిస్తారు.

ఈ అభిప్రాయాల్లో ఒక్కటీ తప్పుకాదన్నదానికంటె, వాటి విభిన్నత తక్కువ ఆశ్చర్యజనకమైనది.



ఉత్సవ దినాన నేవాలో శతఘ్ని వందనం

## నావికుల నగరం

లెనిన్‌గ్రాడ్ నిజంగా నావికుల నగరం, బాల్టిక్ నౌకాదళానికి జన్మస్థలం, నేవా వెడల్పు విశాలంగానూ, సముద్రం సమీపంలోనూ వుండడంవల్ల సెయింట్ పీటర్స్ బర్గ్‌కు "యూరప్‌కు గవాక్షం" అని పేరు రావడంకూడా సహేతుకమే. యీ రేవునుండి సముద్ర మార్గాలు ప్రపంచంలోని అన్ని వేపులకూ పోవడంవల్ల. ఒక పాత పుస్తకంలో పాతదయినప్పటికీ నాకో మంచి భోగట్టా దొరికింది: "స్థాపింపబడినప్పట్నుండీ 1826 వరకూ మా నగరానికి వచ్చిన అరవై వేల నౌకలు నేవా తీరాలలో రెండు లక్షల ఏభై వేల క్యూబిక్ మీటర్ల బలాస్టును (ఓడ పొర్లకుండా వుండేందుకు అడుగున వేసే బరువు) వదిలి వెళ్ళాయి. నగరపు ఎత్తు ఎంతగా పెరిగిందంటే, ఒకప్పుడు ఎప్పుడూ ప్రమాదాన్ని కలిగిస్తూ వుండే నదులు యిప్పుడు అట్టే నష్టాన్ని కలుగజేయడం లేదు. మా లెనిన్‌గ్రాడ్ మట్టిలో సింధునదీ ముఖద్వారం వద్దనున్న కంకర, ఎర్ర సముద్రపు గులాబీ పగడపు యిసుక, మలబారు తీరపు సముద్రపు గుల్లలూ కలిసివున్నవంటే, చెప్పుకోవలసిన సంగతి కాదూ, అది? లెనిన్‌గ్రాడ్, మా నగరపు ఓడరేవు అగ్రప్రాంతమైన క్రోన్‌స్టడత్‌నుండి రెండు శతాబ్దాలుగా ఓడలు సముద్ర ప్రయాణం చేస్తున్నాయి. వ్యాపార నౌకలు సకల దేశాలకూ సరకులను తీసుకవెళ్తున్నాయి. సత్యాన్వేషణకొరకు యాత్రిక నౌకలూ,

ప్రమాదాలను ఎదుర్కొనడానికీ, విజయాలను సంపాదించడానికీ యుద్ధ నౌకలు బయలుదేరాయి. నౌకాదళ కార్యాలయం తన బంగారు ముల్లును సరిగ్గా నగర మధ్యంలో ఎత్తడానికి—దాని గోపురశిఖరాన్ని పలుసార్లు కవులు యీ విధంగా వర్ణించారు—దానికి నిజంగా హక్కు వుంది. దాని కొనకున్న చిన్న బంగారునౌక లెనిన్‌గ్రాడ్‌కు అర్థవంతమైన చిహ్నం. లెనిన్‌గ్రాడ్ సార్థకమైన సాగరనగరం; యీ నగర వీధుల్లో ఉప్పువాసన, తారువాసన వేస్తుంది, నౌకోద్యోగుల నల్లని యూనిఫారాలూ, నావికుల టోపీలూ యీ నగరంలో కనిపించకుండా ఎప్పుడూ వుండవు. లెనిన్‌గ్రాడ్ రేవు పట్టణం అనడానికి ఎటువంటి సందేహమూ లేదు. కాని...



1917, మే నెలలో పుతిలోవ్ కర్మాగారంలో ప్రసంగిస్తోన్న వి. ఇ. లెనిన్ (బ్రాడ్‌స్కీ చిత్ర పునర్ముద్రణ)

## విద్యల నగరం

లెనిన్ గ్రాడ్ నగరంలో నౌకాధికారు లంతగా ప్రొఫెసర్లు కనిపిస్తారు. నావికులకంటె చాలా హెచ్చుగా విద్యార్థులు కనిపిస్తారు. వాసిలీవ్‌స్కీ ద్వీపం తీరం వెంబడిని "విశ్వవిద్యాలయపు జిల్లా" అన్న చిన్న ప్రాంతం ఒకటుంది. ఈ చిన్న స్థలంలో మూడు పరిషత్తులూ, ఒక విశ్వవిద్యాలయమూ, లక్షల లెక్కలో పుస్తకాలు గల ఒక గొప్ప గ్రంధాలయమూ, ఎన్నో విద్యా సంస్థలూ, పరిశోధనాలయాలూ, పరిశోధనా సంస్థలూ వున్నాయి.

లెనిన్ గ్రాడ్ విజ్ఞాననగరం, విద్యలనగరం, ఎంత మాత్రమూ సందేహం లేదు. అందువల్ల పార్కులోని బెంచీ లన్నిటిమీదా యువజనులు కూచొని, పరీక్షలకు చదువుతూ పుస్తకాల్లో లీనమై వున్నారు. వసంతంలో., వెలుపలికిపోయే రైళ్ళలో జాగా సంపాదించడం చాలా కష్టం. ఎంతో మంది విద్యార్థులు సెలవులకు పోతుంటారు, వివిధ శాఖలలో ప్రాక్టికల్ శిక్షణకోసం వెళ్తుంటారు.

ఈ నగరం నిస్సందేహంగా అపారంగా, అవిశ్రాంతంగా పాటుపడే కార్మిక నగరంకూడా. భవనాలూ, దుర్గాలూ, తీరగృహాలూ, అందమైన గట్లు విడిచిపెట్టి దూరం వెళ్ళనక్కరలేదు, ఒకటి తరవాత ఒకటిగా పెద్దపెద్ద ఫాక్టరీలనూ, పరిశ్రమలనూ, వర్క్‌షాపులనూ చూసేందుకు. మా వార్ఫ్స నౌకానిర్మాణం సాగిస్తున్నాయి, ఈనౌకలు అన్ని సముద్రాలకూ పోతాయి. ఏ రేవులోవుండే ఏ ఒక్కరైనా, లెనిన్ గ్రాడ్‌లో నిర్మింపబడిన ఒకపెద్ద నౌక లంగరువేసి వుండడం అప్పుడప్పుడు చూడకతప్పదు. బ్రహ్మాండమైన టర్బయిన్లను నిర్మించే మా పనివారు సోవియట్ దేశం అంతట్లోనూ విద్యుత్కేంద్రాలకు తమ మహత్తర సృష్టిని సరఫరా చేస్తుంటారు. చాలా యిరుగు పొరుగు మిత్రదేశాలలో వారి బలవత్తరమైన రోటర్లుకూడా పని చేస్తున్నాయి.

సెయింట్ పీటర్స్‌బర్గ్ కట్టికట్టక ముందరే అది పారిశ్రామిక

జలక్రీడా స్థావరం. లెనిన్‌గ్రాడ్ నగరం. నేవాలో పడవ పందెం



నగరంగా అభివృద్ధి చెందడం మొదలు పెట్టింది. 19వ శతాబ్దం చివరికి యిక్కడ సుమారు ఐదువందల ఫ్యాక్టరీలు వుండేవి. ఈ నగరానికి లెనిన్‌గ్రాడ్ అన్న పేరు వచ్చినప్పట్నుండీ వాటి సంఖ్య యెంతో హెచ్చింది. కాని యీ మార్పులకూ యితర ప్రత్యేక పరిస్థితులకూ సంబంధం వుంది.

## అప్పటికీ - ఇప్పటికీ

ఒక పెద్ద నగరంలోని ఆడంబరమైన మధ్యభాగం యెలా వుంటుందో, పొలిమేరలలోని ఫ్యాక్టరీ, కార్మికపేట లెలా వుంటాయో అందరూ ఎరిగిన సంగతే. మధ్య భాగం తళతళ మెరుస్తూ, భోగభాగ్యాలతో, పరిశుభ్రతతో, సౌకర్యాలతో తులతూగుతూ వుంటుంది. కాని పొలిమేరలలో మురికి, యంత్రాల మోత, దరిద్రపు కొంపలూ, పొగబారిన ఆకాశం, కష్టాలలో కూరుకపోయిన ముఖాలతో స్త్రీ పురుషులూ, చాకిరీతో వంగిన వారి నడుములూ కనిపిస్తాయి.

మిత్రులారా, మీరు చాలా దూరాన వున్నారు. మీరిక్కడికి, నేవా తీరానికివచ్చి నగర మధ్యభాగాన్నే కాకుండా, ఒకప్పుడు మేము "పొలిమేర" లనే చోట్లకు కూడా చూడాలని మా అభిలాష. పూర్వంలోలాగ మీకు యిప్పుడు వెళ్ళ శక్యంగాని మురికి గుంటలు కనిపించవు. లెనిన్‌గ్రాడ్ పొలిమేరల్లోని వీధులు, దాని మధ్యభాగంలోని వీధులంత విశాలంగా వున్నాయి. అన్ని వేపులకూ బస్సులూ, ట్రాలీ బస్సులూ పోతున్నాయి. యిరువేపులా వున్నతమైన గృహాలూ, మెరిసే షోవిండోలూ వున్నాయి, చీకటిపడ్డాక విద్యుద్దీపకాంతులు తళతళలాడుతున్నాయి. అన్నిటికంటె పెద్దవిగానూ, అన్నిటికంటె చక్కగానూ వున్న మా సినీమాలూ, సంగీత ప్రదర్శన మందిరాలూ మధ్యలో లేవు, నలభై ఏళ్ళ క్రితపు జారిస్టు సెయింట్ పీటర్స్‌బర్గ్ నగరపు ఒకనాటి మురికి పేటలైన పొలి మేరల్లో వున్నాయి. సంస్కృతీ భవనాల, కార్మికుల క్లబ్బుల ముఖద్వారాలు ప్రతిచోటా దీపాలంకృతాలై వున్నాయి. పచ్చనిపార్కులూ, అనేక పాఠశాలలూ పిల్లల గొంతులతో కిలకిల లాడుతున్నాయి. వింటర్ ప్యాలస్, అనిచ్కోవ్ ప్యాలస్ ప్రాంతాలలో వున్నన్ని పాఠశాలలూ యిక్కడా వున్నాయి. పాత సోవియట్ నగరాలన్నిట్లోనూ యిటువంటి మార్పులే వచ్చాయి. ఎందుచేత ? విప్లవం జరగడం వల్లనే, యీ నగరానికి అధినేత, అత్యంత గౌరవనీయుడైన పౌరుడు యిప్పుడు కార్మికుడైనందువల్లనే. మేధావి కాని, కార్మికుడు కాని, సమిష్టి శ్రేయస్సుకొరకు చైతన్యయుతంగా పాటుపడే స్వేచ్ఛాయుతు డతడు।



లెనిన్‌గ్రాడ్ ఒక పెద్ద పారిశ్రామిక కేంద్రం. సోవియట్ దేశ విద్యుత్కేంద్రాలకు శక్తివంతమైన టర్బైన్‌లు. యిక్కడి కర్మాగారాలలో నిర్మాణమవుతాయి

నఖిమోవ్ నౌకా పాఠశాల విద్యార్థులు, తాము శిక్షణ పొందుతున్న నౌక "అరోరా" వద్దకు తిరిగివెళ్తూ



## పాత జ్ఞాపకాలు

విప్లవం యిటువంటి కృషికి ఎంతో అనుకూలమైన పరిస్థితులను సృష్టించింది. ఆశ్చర్యమేమీ లేదు. దానికొరకు యీ అద్భుతమైన పునాదిని శ్రామిక ప్రజలు వేశారు, నిర్మించారు. నా కింకా జ్ఞాపకం వుంది, ఆకురాలు కాలపు చివరిరోజుల్లోని చలిచలిగా చెమ్మ చెమ్మగావున్న ఆ రాత్రిపూట. చరిత్రలోని ఒక గొప్ప ఆదర్శం అప్పుడు అగ్నిపరీక్ష నెదుర్కొంటోంది. తిరుగుబాటు, అక్టోబరు విప్లవం అగ్నిపరీక్ష నెదుర్కొంటోంది. నేను, చాలామంది యితరులవలెనే ఆరాత్రిపూట వీధుల్లో గడిపాను. అప్పుడు నా వయసు పదిహేడేళ్ళు, నేను యింట్లో ఎలా ఉండగలుగుతాను ?

నగరం నిశ్శబ్దంగా వుంది, ఆతృతగా వుంది. కారుచీకటిలోనూ, నిస్తబ్దతలోనూ కార్మిక, సైనిక దళాలు తమ గమ్యస్థలాలకు సాగిపోతున్నాయి. కెరెన్‌స్కీ ప్రభుత్వం తలదాచుకునివున్న వింటర్‌ప్యాలస్‌ను వారు చుట్టుముట్టారు. తుఫానులన్నిట్లాగనే యిది కూడా చడీచప్పుడూ లేకుండా రగిలింది. విప్లవకారు లప్పటికే వంతెనలను ఆక్రమించుకున్నారు. లెనిన్, ఆయన సిబ్బందీ పోరాటాన్ని నడిపారు.

తరవాత గాలివీచింది, చీకటిలోనుండి ఎవరో తరిమి కొట్టినట్టుగా. శతాబ్దాల దాస్యరాక్షసి గుండెల్లోకి గురిపెట్టి, పాతకాలపు రష్యా గుండెల్లోకి గురిపెట్టి ఫిరంగి గుళ్ళు పేల్చుతూ "అరోరా" విజయగర్జన చేసింది. విప్లవ సేనది తొలిసారిగా పైచెయ్యి అయింది.

ఇదంతా జరిగి నలభై ఏళ్ళయింది. ఆ రాత్రే, వాస్తవానికి ఆ రాత్రే పీటర్స్‌బర్గ్, లెనిన్‌గ్రాడ్ అయింది, ఏడేళ్ళ తర్వాత లెనిన్ కీర్తిశేషులయ్యాక మాత్రమే దానికి సమర గౌరవంగా యీ పేరువచ్చినప్పటికీ.

## మూడు ఉత్సవాలు

ఈఏడాది మేము రెండు, కాదు, మూడు పండగలు చేసుకుంటాము. పీటర్స్‌బర్గ్ 250వ వార్షికోత్సవం, అక్టోబరు విప్లవపు 40వ వార్షికోత్సవం, ప్రపంచ యువజనోత్సవం. యువజనోత్సవం మాస్కోలో జరుపబడుతుంది, నిజమే. కాని లెనిన్‌గ్రాడ్‌నుండి అది ఒక్కరాత్రి రైలు ప్రయాణం మాత్రమేకదా. అతిథులలో చాలామంది మా నగరానికి వస్తారని మాకు

బాగానమ్మకం. అప్పుడు మేము వారికి సంతోషంగా మా లెనిన్‌గ్రాడ్‌ను చూపుతాము. ఉత్సవ సందర్భంలోవారు మా వద్దకు రాలేకపోయినా, యింకొకప్పుడైనా వారు రాగలరనే మా విశ్వాసం.

అది ఒక శ్వేతరాత్రిని జరిగినట్లయితే, చిన్న పెడ్రీలమీద మా అతిథులను ప్రఖ్యాతమైన కిలగీజా ద్వీపానికి తప్పకుండా తీసుకవెళ్తాము. ఇక్కడ, మొదటి పీటర్ చక్రవర్తికి చాలా ముందుగా మొలకలెత్తిన గొప్ప ఓక్ చెట్లు వచ్చవనంతో కనుల పండువుగా వుండే పార్కుమధ్యను జారు చక్రవర్తి యొక్క మహత్తరమయిన పాత రష్యణ్ భవనం, చలవరాతి ముద్దలాగా తెల్లగా వున్న భవనం ఒకటుంది. తమ సాయంత్రపు సమయాలనూ, విశ్రాంతి దినాలనూ యిక్కడ గడిపి, ప్రతిచోటు పెద్దపార్కులలో ప్రజలు ఆనందించే టట్లుగా ఆనందించడమంటే, లెనిన్‌గ్రాడ్‌లో వారందరికీ యిష్టం. మీపార్కులలో కూడా ఉయ్యాలలూ, రంగుల రాట్నాలూ, గమ్మత్తయిన వింతల అద్దాలూ వున్నాయి కదూ.

మీరు శీతకాలంలో వచ్చినట్లయితే మీకు మా ఫర్ బట్టలను కప్పి, మా శ్వేతనగరాన్ని మీకు చూపుతాము. ఈ కాలంలో నేవా నది ఎంతగా గడ్డకట్టుకపోయి వుంటుందంటే, ఎంతో బరువైన లారీలు కూడా సురక్షితంగా దానిమీద వరుగులు పెడతాయి. ఆకులతో కాకుండా తెల్లని తుషార కణాలు కప్పి దేవతల తెల్లపగడపు కట్టడాల లాగా నిస్తబ్ధంగా, దివ్యంగా నిలిచివున్న చెట్లుకూడా మీరు చూస్తారు.

భారత దేశం భూమధ్య రేఖకు సమీపంగా వుంది. మేము ధృవమండలానికి చేరువలో వున్నాము. భారతీయులవి నల్లని జుట్లు, నల్లని కళ్ళు. రష్యన్లం తెల్లని వాళ్ళం. కాని మన హృదయ స్పందనం ఒక్కటే. మనం వేరుపడవలసిందేదీ లేదు. మనం కలసి కృషిచేస్తున్నది చాలా అధికం—ప్రపంచ శాంతి, సర్వ మానవ సౌభాగ్యం మన సమిష్టి ఆదర్శం. భారతీయ సోదరులారా, నేవా తీరాన వున్న మా నగరాన్ని మీరు ప్రేమించేటట్లుగా నేను చేయగలిగినట్లయితే, నేను ఆనంద పడతాను. లెనిన్‌గ్రాడ్‌లోని మాకు ప్రతి ఒక్కరికీ, అందరికీ మీ నగరాలు చాలకాలంగా ప్రీతి పాత్రమైనవి. మనం మిత్రులుగా వుందాం. త్వరలో మీరు మా వద్దకు రాగలరని ఆశిస్తున్నాం.

---

## ఒకనాటి వెనుకబడిన మండలం నేడు సిరిసంపదలకు నిలయం

(12 వ పుట తరువాయి)

చాలా కొండ నదులున్నాయి: జల విద్యుచ్ఛక్తి ఆధారాల విషయంలో మా రిపబ్లిక్ సోవియట్ దేశంలో రెండోస్థానాన్ని ఆక్రమిస్తోంది: మొదటి స్థానం రష్యన్ సమాఖ్యది. ఈ పంచవర్ష ప్రణాళికా కాలంలో మేము కైరక్-కుమ్ జల విద్యుచ్ఛక్తి పరిశ్రమ నిర్మాణాన్ని పూర్తి చేస్తాము. భారత దేశంలోని భకరన్ డాము వద్దనున్న విద్యుత్కేంద్రంకంటె యిది సుమారు నూటికి 25 వంతులు యెక్కువగా విద్యుచ్ఛక్తిని ఉత్పత్తి చేస్తుంది: వక్ష కాలువ మీద చిన్న పరెపద్నయా జల విద్యుత్కేంద్రాన్ని నిర్మిస్తాము: వక్షనదిమీద గొలొవ్నయా జలవిద్యుత్కేంద్ర నిర్మాణాన్ని ప్రారంభిస్తాము. ఈ విద్యుత్కేంద్రం శక్తి భరాకద్ కేంద్రం శక్తికి సమానంగా వుంటుంది. మొత్తంమీద తజికిస్థాన్లో, ప్రస్తుత పంచవర్ష ప్రణాళికా కాలంలో విద్యుచ్ఛక్తి ఉత్పత్తి నాలుగు రెట్లు హెచ్చుతుంది.

వ్యవసాయానికి అనుకూలమైన భూమి మా కొండల రిపబ్లిక్కులో చాలాకొద్ది. అయినా, యీ పంచవర్ష ప్రణాళికా కాలంలో యింకో 130 000—140,000 హెక్టార్ల ఎడారి భూమికి నీటి వసతులు కలిగించి సాగులో పెడతాము: పత్తి పంటలను బాగా పెంచుతాము రిపబ్లిక్‌లో పండే చక్కని పోగుగల పత్తి రకాల మొత్తాన్ని రెట్టింపు చేయడానికి, ప్రత్యేకంగా పథకం వేస్తాము.

ప్రస్తుతం సోవియట్ దేశంలో ఆర్థిక మండలాలు నెలకొల్ప బడుతున్నాయి, ఆర్థిక శాఖల పరిపాలన కేంద్ర మంత్రిత్వ శాఖలనుండి స్థానిక శాఖలకు బదిలీ చేయబడుతోంది. అందువల్ల మారిపబ్లిక్‌లోని ఉత్పత్తి శక్తులను ఇంకా సద్వినియోగం చేయ గలుగుతాము, బహుశా మాప్రస్తుతపు లక్ష్యాలు నిర్ణీతకాలానికి ముందరగానే చేసుకోవడం జరుగుతుంది.

(13వ పుట తరువాయి)

సూచించబడింది.

విమానాలమీదనుండి ఫోటోలు తీయడం విషయమై ఒక ముఖ్యమైన కొత్త ప్రతిపాదనను సోవియట్ దేశం సమర్పిస్తుందని కూడా జోరిన్ అన్నారు.

అమెరికన్ ప్రభుత్వమూ, అధ్యక్షుడు ఐసెన్‌హోవర్ స్వయంగానూ, యీ విషయానికి గొప్ప ప్రాముఖ్యత నిస్తున్నారన్నదీ, దానిపైన ఒప్పందం కుదరకపోవడంవల్ల పాక్షిక ఒడంబడికను సాధించడానికి కూడా అవరోధాలు ఏర్పడుతున్నాయన్నదీ దృష్టిలోకి తీసుకుని సోవియట్ ప్రభుత్వం, పాశ్చాత్య రాజ్యాలతో కొంతవరకు అంగీకరించేందుకు మరొక చర్య తీసుకోడానికి నిశ్చయించి, ఒక్క యూరప్‌లోనే కాకుండా, ఒకవేపు తూర్పు సైబీరియా, సముద్రతీర ప్రాంతమూ, కమ్‌చట్కా, సఖాలిన్ మొత్తం 7,129,000 చదరపు కిలోమీటర్ల ప్రాంతంతోనూ, యింకొకవేపు అలాస్కా, అమెరికా పశ్చిమ భాగమూ మొత్తం 7,063,000 చదరపు కిలోమీటర్ల ప్రాంతంతోనూ సహా దూరప్రాచ్యంలో కూడా ఒక విశాల మండలంలో విమానాలమీదినుండి ఫోటోలు తీయడానికి అంగీకారాన్ని వెల్లడిస్తూంది.

విశాల ప్రాంతంలో విమానాలమీదనుండి పరిశీలన జరగాలని అమెరికా పట్టుబడుతూందన్న విషయాన్ని దృష్టిలోకి తీసుకుని మేము, దూరప్రాచ్యంలో సోవియట్ యూనియన్, అమెరికాల భూభాగంపై విమానాలమీదనుండి ఫోటోలు తీయడానికి యీ మండలాన్ని ప్రతిపాదిస్తున్నాము అన్నారు జోరిన్.

విమానాలమీదినుండి ఫోటోలు తీయడానికి యూరోపియన్ మండలం విషయంలో కూడా సోవియట్ దేశం, అమెరికన్ ప్రతినిధి వర్గ దృక్పథంతో అంగీకరించడానికి ఒకచర్య తీసుకున్నది. సోవియట్ ప్రభుత్వం తీసుకున్న యీ చర్యలు, పాక్షిక నిరాయుధీకరణ చర్యల గురించిన ఒడంబడికను సులభతరం చేస్తాయి.

ప్రపంచ శాంతినీ, ప్రజల భద్రతనూ పటుతరం చేయడానికి చర్యలగురించి ఒక ముసాయిదా ప్రకటననూ, పాక్షిక నిరాయుధీకరణ చర్యల గురించి సోవియట్ పభుత్వ ప్రతిపాదనలను తెలియజేసే ఒక మెమొరాండమ్‌నూ ఉపసంఘం పరిశీలనకు సోవియట్ ప్రతినిధి సమర్పించారు.

సుహృద్భావంతోనూ, నిరాయుధీకరణ తక్షణ సమస్యకు ఆచరణయోగ్యమైన ఒక పరిష్కారాన్ని కనుగొనాలనే వాంఛతోనూ సోవియట్ దేశం తన పాక్షిక నిరాయుధీకరణ ప్రతిపాదనలను సమర్పిస్తూందని ముగింపులో జోరిన్ నొక్కి చెప్పారు.

---

# సోవియట్ దేశంలో బాండుంగ్ మహాసభ ద్వితీయ వార్షికోత్సవం

బాండుంగ్ మహాసభ ద్వితీయ వార్షికోత్సవ సందర్భంగా ఒక ప్రత్యేక సమావేశం, మాస్కోలోని విజ్ఞాన శాస్త్ర పరిషత్తు యొక్క ప్రాచ్య విద్యాసంస్థ భవనంలో, ఏప్రిల్ 18న జరిగింది. సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు ఉపాధ్యక్షుడు అకెడెమీషియన్ బర్దిన్, ఈ సమావేశాన్ని ప్రారంభించారు.

ప్రాచ్య విద్యా పరిషత్తు దర్శకుడు బి. గపురోవ్, డి. యస్ సి. (చరిత్ర), సమర్పించిన నివేదికలో శాంతి భద్రతలను పటిష్టం చేయుటలో మహాసభకు గల గొప్ప ప్రాముఖ్యాన్ని ఉద్ఘాటించారు. శాస్త్రజ్ఞులు, బాండుంగ్ మహాసభలో పాల్గొన్న దేశాల రాయబార, ప్రతినిధి వర్గాల అధిపతులతో కూడిన శ్రోతలు, ప్రసిద్ధ సోవియట్ శాస్త్రజ్ఞుడు, ఆఫ్రికా విషయాలలో నిపుణుడు ఐ. పొతెఖిన్ భారత విద్యాధ్యయన వేత్త ఎ. దయకోవ్ నివేదికలను విన్నారు.

మిస్టర్ మరామిస్, ఇండొనీషియా రిపబ్లిక్కు అసాధారణ సర్వాధికారయుత రాయబారి ఈ సమావేశంలో ఉపన్యసించారు.



# మాస్కో ప్రాచ్య సంస్కృతీ వస్తు ప్రదర్శనాలయం భారతీయ కళా సంచయం

< సెవ్యోన్ త్యుల్యాయేవ్ >

రష్యా ప్రజలు, భారత సంస్కృతిపట్ల బహుకాలంగా అభిమానాన్ని కనబరుస్తూ వచ్చారు. జారు పరిపాలనా కాలంలో ప్రాచ్యకళా ప్రదర్శనానికీ ప్రత్యేక ప్రదర్శనాలయం కానీ, ప్రదర్శించను భారత కళాఖండాలు కానీ లేవు. ప్రసిద్ధ ప్రాచ్య కళా పెత్తల కళాఖండాలు, దేశంలోని పెద్దపెద్ద వస్తు ప్రదర్శనాలయాలు సేకరించిన వస్తుసంచయాలలో స్వల్ప భాగంగా ఉండేవి.

1918లో, మాస్కోలో, ప్రభుత్వ ప్రాచ్య సంస్కృతీ వస్తు ప్రదర్శనాలయం నెలకొల్పబడింది. ఆ ప్రదర్శనాలయ భారత విభాగానికి 30 సంవత్సరాలనుంచీ నేను ఆధిపత్యం వహిస్తున్నాను.

పెద్దపెద్ద ప్రాచీన వస్తు ప్రదర్శన శాలలు తమతమ వస్తుసంచయాలనుంచి మాకు పంచి సంతరించి పెట్టిన భారత, చైనా, ఇతర ప్రాచ్యదేశాల కళాఖండాలకు అనుబంధంగా మేము, వ్యక్తుల కళా వస్తు పంచయాలనుండి ఖరీదుచేసి కొన్ని కళాఖండాలను సేకరించాము. ప్రదర్శనాలయంలో భారత కళావిభాగానికి, గౌరవప్రదమైన స్థానము ప్రత్యేకించబడింది. సంచార, సమకాలీన భారత కళాప్రదర్శనలను సోదర సోవియట్ రిపబ్లిక్కులకు పంపించే పద్ధతిని మేము ఆచరణలో పెట్టి, ఆ రిపబ్లిక్కుల పురావస్తు సంచయాలలో మా కళావస్తువులకు అవిరళంగా స్థానం కల్పించాము.

మా వస్తుప్రదర్శనాలయ వస్తుప్రదర్శకులు పర్యటిస్తూ, పెద్దలకూ పిన్నలకూ ఉపన్యాస పాఠాల చదివి వినిపిస్తుంటారు: సోవియట్ ఉన్నత పాఠశాలల పాఠ్య ప్రణాళికలో భారత దేశ చరిత్ర, కళ, సంస్కృతి, భూగోళశాస్త్రాల అధ్యయనం చేర్చబడింది.

భారత దేశంపట్ల సోవియట్ ప్రజాభిరుచి గడచిన కొద్ది సంవత్సరాలలో సువిదితమవుతున్నది.

ఇటీవల నేను, "సోవియట్ దేశ వస్తుప్రదర్శనాలయాలలోని భారత దేశ విశిష్ట కళాఖండాలు" అనే చిత్ర సంపుటిని సంకలనం చేశాను. అందులో నేను మా వస్తుప్రదర్శనాలయంలోను, సోవియట్ దేశంలోని ఇతర పెద్దపెద్ద వస్తుప్రదర్శనాలయాలలోను ప్రదర్శింపబడుతున్న ప్రాచీన, నవీన భారత కళాఖండాల ప్రతులను చేర్చాను.

1955లో, ప్రప్రథమంగా నేను భారత దేశాన్ని సందర్శించాను. ఈ పర్యటన, ఈ పురాతన, సువిశాల దేశపు కళలకు, చేతిపనులకు సంబంధించిన నా పరిజ్ఞానాన్ని సుసంపన్నం చేసింది. స్వదేశానికి తిరిగివచ్చిన తర్వాత నేను నా భారత దేశానుభవాలను గురించి వందలాది ఉపన్యాసాలలో చెప్పాను. వర్ణచిత్రాల స్లైడ్స్‌ను ప్రదర్శించి చూపాను.

ఇదివరలో, మా వస్తు ప్రదర్శనాలయాలను నింపడం ఎంతో కష్టంగా వుండేది. భారత దేశం స్వతంత్ర రిపబ్లిక్కు అవడంతో, వెనువెంటనే మా సాంస్కృతిక సంబంధాలు విస్తృతం కాజొచ్చాయి. ప్రాచ్యసంస్కృతీ వస్తుప్రదర్శనాలయం మీద యీ సంబంధ ప్రభావంపడి, మా ప్రదర్శనాలయానికి ప్రదర్శనార్థం నవీన భారత కళారచనలు రావడం మొదలైంది.

"సుహృద్భావ స్థాపనకు, కళ ఉత్తమ రాయబారి" అన్న వాస్తవమైన సామెత ఒకటి వున్నది. ఒకరితో ఒకరు మంచి పరిచయం కల్పించుకోవడానికి, ఒక దేశ ప్రజలు మరొక దేశ ప్రజల కళను తెలుసుకోవడం ఎంతో అవసరం. దీనికి నిదర్శనగా, అఖిల భారత కళా, అనువర్తిత కళాసమితి ఆధ్వర్యాన ఢిల్లీలోను, భారత రిపబ్లిక్‌లోని ఇతర ప్రధాన నగరాలలోను 1952లో ఆవిష్కరించబడిన రష్యా కళాప్రదర్శనను పేర్కొనవచ్చు. భారత ప్రజలు దీనికి మనఃపూర్వకమైన స్వాగతం యిచ్చారు. ఆ మరుసటి సంవత్సరం, దీనికి ప్రతిగా పైసమితి ఆధ్వర్యాన, మా దేశంలో ఏర్పాటు చేయబడిన భారత కళా ప్రదర్శన అసంఖ్యాకంగా సందర్శకులను ఆకర్షించింది.

ఈ ప్రదర్శనంలోని అనేక ఆకర్షణీయమైన చిత్రాలను, శిల్పాలను, ప్రాచీన కళాఖండాల చిన్నచిన్న ప్రతులను మా వస్తుప్రదర్శనాలయానికి, లెనిన్‌గ్రాడ్‌లోని ప్రసిద్ధమైన హెర్మిటేజ్‌కు (దీనికొక భారత కళావిభాగం వున్నది) సమకూర్చుకోను అవకాశం లభించింది. ఇక్కడ ప్రదర్శితమైన కళాఖండాలలో విలువైన ఆకర్షణీయమైన ఇరవై చిత్రాలను, భారత ప్రభుత్వం సోవియట్ దేశ సంస్కృతీ మంత్రిత్వశాఖకు బహూకరించింది. వీటిలో సగం, మా ప్రాచ్య సంస్కృతీ ప్రదర్శనాలయానికి బహూకరించబడడం మరీ మాకు ఎంతో హర్షాన్ని కలిగించింది. గత సంవత్సరం మరొక ఆకర్షణీయమైన సమకాలీన, ప్రాచీన భారత కళాప్రదర్శన సోవియట్ దేశంలో ఏర్పాటు చేయబడింది. ఈ ప్రదర్శనలోని అనేక చిత్రాలు కూడా మాకు సేకరించి ఇవ్వబడగలవని ఆశిస్తున్నాము. ఇప్పుడు యీ ప్రదర్శన, ఇతర దేశాలలో పర్యటిస్తున్నది.

మాకు మరీ సంతోషాన్ని కలిగించిన సంఘటన, 1955-56లో జరిగిన భారత దేశపు ప్రస్తుత కుటీర పారిశ్రామిక వస్తు ప్రదర్శనలో అధిక భాగాన్ని సోవియట్ ప్రభుత్వం సంపాదించగలగడం. ఈ వస్తు సంచయంలో విఖ్యాత భారత నేతపనివారు తయారుచేసిన వస్త్రాలు, సిరమిక్, దారు, అస్థి, లోహ శిల్పఖండాలు, లోహవస్తు విశేషాలు

నిర్మల్ లక్క-చెక్కడాలు, సున్నితమైన కాగితపు గుజ్జుతో చేసిన కాశ్మీర కళావస్తువిశేషాలు వున్నాయి.

ఇటీవల మా పత్రికలో పేర్కొనబడినట్టు, సోవియట్ దేశంలోని భారత రిపబ్లిక్ అసాధారణ సర్వాధికారయుత రాయబారి కె. పి. యస్. మీనన్, వి. అహూజా, భారత రాయబార కార్యాలయ ప్రథమ కార్యదర్శి, భారత ప్రభుత్వ పక్షాన సోవియట్ ప్రజలకు విశిష్ట భారత కళాఖండాలను—జయపూర్ ఎనామిల్ వస్తు సామగ్రినీ, నిర్మల్ లక్క వస్తువులను, బిదరీ లోహవస్తువులను, దారు లతా చిత్రితమైన తెరలను, ఎర్రకర్ర చెక్కడపు పనులను కానుకగా యిచ్చారు.

ఈ నవీన కళాఖండాలన్నీ మా ప్రదర్శనాలయంలోనూ, లెనిన్‌గ్రాడ్‌లోని హెర్మిటేజ్‌లోను నిత్యం ప్రదర్శింపబడుతున్నాయి.

ఏటా మా వస్తుప్రదర్శనాలయ వివిధాగారాలలో 2,500యాత్రలు జరుగుతాయి. మా వివరణకర్తలు, వివిధ వస్తువుల ప్రాముఖ్యాన్ని సమగ్రంగా విశదీకరిస్తుంటారు. ప్రదర్శనాలయ సందర్శకులలో విశేష ప్రాచుర్యాన్నార్జించుకొన్నవి సరిగ, బుట్టావేసిన బెనారస్, సూరత్‌లలో తయారైన "అమ్రూ", "కిమ్‌ఖా" "కిన్కాబ్" పట్టువస్త్రాలు, నేర్పుతో విగ్రహాలు నేయబడిన రుమాళ్ళు. నిర్మల్ లక్క వస్తువులు ముఖ్యంగా బంగారువంటి నగిషీలుగలవి; హైదరాబాద్ "బిదరీ" లోహవస్తువులు వాటిమీదివెండి చెక్కడపుపనీ; సుందరమైన కృష్ణుని, గోపికల, సరస్వతీ, లక్ష్మీదేవతావిగ్రహాల దంత శిల్పం, విగ్రహాలను చూచి వారు ముగ్ధులవుతున్నారు. భారత ప్రజల కళలు వైవిధ్యం గలవి! ఎంత సౌందర్యం, ఎంత వైదగ్ధ్యం ఎంత మానవత వారి కృషిలో నిక్షిప్తమై వుంది! ఎంత ప్రేమతో అవి నిరాడంబరులైన భారత శ్రామికులను, కళాకారులను రైతులనుచిత్రిస్తున్నాయి. పాత ఢిల్లీ, మైసూర్, తిరువాన్కూర్-కొచ్చిన్ మొదలైన ప్రాంతాలలోని దంతపు పనివారి పుష్ప లతా లతికా చిత్రణానైపుణ్యం సోవియట్ ప్రదర్శనాలయ సందర్శకులను సర్వదా ఆశ్చర్యపరుస్తుంది. ఈ పరిశ్రమపట్ల, భారత చేతిపనివారి పారంలేని ఓపికపట్ల, కళాకారుల సాంప్రదాయక జానపద సాహితీ పరిజ్ఞానంపట్ల వారికి గౌరవాదరాలను రేకెత్తిస్తుంది.

మా కళావస్తు సంచయంలో ప్రాచీన భారత కళాఖండికలెన్నో బాబర్ స్మృతులకు సంబంధించిన 16వ శతాబ్దపు 69 చిత్రప్రతుల వంటివి ఉన్నాయి.

మా ప్రదర్శన కళాఖండాలలో 17వ శతాబ్దపు, మొగలాయీ కళారీతులకు చెందిన మొగల్ రాకుమారుల సూక్ష్మచిత్రప్రతులు, కొన్ని 17వ, 19వ శతాబ్దాలకు చెందిన రాజపుత్ర కళాఖండాలు సాంస్కృతికంగా చారిత్రకంగా మహత్తర ప్రాముఖ్యం కలిగినవి వున్నాయి.

మా సంచయంలోని సమకాలీన భారత చిత్రకారుల చిత్రాలలో కొన్ని జిక్జా "మలబార్ సుందరి:" ఎస్. ఎస్. బెనర్జీ "పల్లెలోని కొలను" "వరినాట్లు:" బీరేశ్వర్ సేన్ "మంత్రబద్ధమైన తటాకం" ప్రమోద ఛటర్జీ "చంద్ర శేఖర్."

ఈ కళా ఖండికలన్నీ భారత చిత్రకారుల మహత్తర మౌలికతను వేనోళ్ళ చాటుతున్నాయి.

భారత కళాకారుల కౌశల్యం, జాతీయ ప్రతిభా వ్యుత్పత్తులు దారు వర్ణ చిత్రాల చెక్కడంలోకూడా ప్రస్ఫుటమవుతున్నది. ఈ శ్రేణికి చెందిన చిత్రాలలో ఎక్కువగా ప్రశంసించబడుతున్నది. హరెన్‌దాసు యొక్క "జోడు పావురాలు."

భారత రిపబ్లిక్‌తోపాటు పరస్పరంగా కళాప్రదర్శనలను ఏర్పరుచుకోవడం మా ప్రాచ్య సంస్కృతీ ప్రదర్శనాలయ భారత కళా విభాగ విస్తృతీకరణకు సాధన కాగలదని మా ఆశ.



వస్తు ప్రదర్శనాలయంలోని కళాఖండాలను పురా వస్తు పరిరక్షక నిపుణుడైన ఎఫ్. కొటిన్‌స్కీ, భారత విభాగాధిపతి ఎస్. త్యుల్యయేవ్ (కుడి) జాగ్రత్తగా కాపాడుతుంటారు

# విస్మృత కవి

ఎ. ఒదింత్సోవ్

అన్వేషణ చేయబడుతోన్న వ్యక్తిని గురించి మాటాడడానికి ముందర, అన్వేషిస్తోన్న వ్యక్తిని గురించి నాలుగుమాటలు చెప్తాను.

హబిబుల్లా నజరోవ్ ఆజన్మ యాత్రికుడు, పరిశోధకుడు. పొడగరి, బలిష్టుడు, నల్లని జుట్టు, ఎప్పుడూ ఉషారుగా, ఉల్లాసంగా ఉంటారు. ఆయన గొప్పకథకుడు, నవ్వితే నవరత్నాలు రాలినట్టుగా వుంటుంది.

సుమారు నాలుగేళ్ళ క్రితం, ఒక కొండ వాగుక్రింద ఆయన కోరాయి దొరికింది. దాన్ని తియ్యడానికి నజరోవ్ ఆ అతి చల్లని వాగులోపలికి వెళ్ళవలసివచ్చింది. ఆ చల్లనీళ్ళలోకి దిగినా కష్టం ఫలించింది. పరిశోధనాలయంలో పరిశీలించగా, అది సీసం ఎక్కువభాగంగా వున్న క్రత్రిమ శిల అని తేలింది. తజిక్కుల ప్రాచీన పూర్వీకులైన సొగ్దియన్లు రాతి పళ్లాలు చేసే పద్ధతి అది. పురావస్తు తత్త్వశాస్త్రజ్ఞులు నజరోవ్ సంపాదనలో ఆసక్తిని చూపారు.

....తజిక్ వ్యంగ్య పత్రిక "ఖొర్పుషతక్" (ముండ్లపంది)లో నద్రిం అన్న కవిపేరిట తీవ్రమైన వ్యంగ్యగీతాలు వెలువడేవి. నద్రిం అన్నది నజరోవ్ మారుపేరు. ఆయన గీతాల సంపుటమొకటి కొద్దికాలం క్రితమే ప్రచురింపబడింది.

పురావస్తు తత్త్వశాస్త్రమూ, కవిత్వమూ, యీ రెండూ హబిబుల్లా నజరోవ్‌కు విలాస కృత్యాలు మాత్రమే. ఆయనవృత్తిచేత న్యాయవాది. తజిక్ రిపబ్లిక్ న్యాయశాఖామంత్రి. ఇది కూడా ఆయనకు రెండవవృత్తి. ముప్పయ్యేళ్ల క్రితం ఆయన కొండగ్రామమైన చినార్‌లో గొర్రెల కాపరిగా పనిచేసేవారు.

1955లో వ్యవహారాలకని తిరుగుతూ వుండగా నజరోవ్ ఒక గ్రామపు దుకాణంలో వ్యాపారగుమస్తా గులామ్ కాదిర్‌ను కలుసుకున్నారు. గులామ్ కాదిర్‌కు పాటలంటే ప్రీతి. తంబూరా శ్రుతితో హాఫీజ్, బెదిల్, సాదీ గజలులు పాడితోడిగ్రామస్తులకు వినిపిస్తూ వుండేవాడు (ప్రాచీన మహాకవులపాటలు తజికిస్తాన్లో సుప్రసిద్ధాలు). నజరోవ్ కవిత్వంలో అరితేరిన చేయి. తజిక్ కవుల గీతాలను వేల సంఖ్యలో ఆయన అప్పగించగలరు. అయినా ఆయనకు కూడా అప్పుడు ఆశ్చర్యం కలిగింది. గులామ్ కాదిర్ పాడిన గీతాలలో తాను ఎన్నడూ ఎరగని చక్కని పాటలున్నాయి. అవి ఎవరో ఒక మహాకవి వ్రాసినవన్నది స్పష్టం.

"ఈ అద్భుత గీతాలు వ్రాసిందెవరు?" అని నజరోవ్ ఆ వృద్ధుణ్ణి అడిగారు.

"కరీమ్ దెవోనా" అని ఆయనజవాబిచ్చాడు.

గులామ్ కాదిర యింకొన్ని గీతాలు చదివారు. అవి వ్యంగ్య గీతాలూ, పాటాలూ, నీతి కథలూ. అవన్నీ అద్భుతమైనవే.



హబీబుల్లా నజరోవ్ (ఎడమనుంచి రెండవ వ్యక్తి) జానపద కవి కరీమ్ దెవోనా గురించిన వృద్ధుల జ్ఞాపకాలను, ఈ కవి పద్యాలను వ్రాసుకుంటూ

దెవానా గీతాల అన్వేషణకు పూనుకోవాలని నజరోవ్ నిశ్చయించుకున్నారు. ఆ కవి ఎవరో ఆయన కాలమేమిటో తెలుసుకోవాలనుకున్నారు. చాలామంది వృద్ధులను కలుసుకోగా ఆ అద్భుత కవి గీతాలు తజికిస్తాన్, ఉజ్బెకిస్తాన్‌లలోని ఉన్నత ప్రాంతాలు చాలా వాటిలో వ్యాపించి వున్నాయని తెలిసింది అంతేకాకుండా దెవానా 1918 లో ప్లేగు వ్యాధికి గురి అయి మరణించారని కూడా తెలిసింది. సోవియట్ పాలన అప్పటికింకా తూర్పు బుఖారాలో లేదు; అప్పుడు తజికిస్తాన్ దానిలో ఒకభాగం. అది అశాంతి వ్యాపించివున్న కాలం. త్వరత్వరగా ఒకదాని వెంబడిని వొకటిగా సంఘటనలు జరుగుతూన్న కాలమది. ప్రజా వైతాళికుని గీతాలను భద్రపరచడానికి సాధ్యపడలేదు. కవి నిరక్షరాస్యుడట. ఆయనకు చుట్టుప్రక్కల అక్షరాస్యులైనవారు తక్కువ అందువల్ల దెవానా గీతాలు ఒకరినోటంట ఒకరికి వ్యాపించాయి.

నజరోవ్ సుమారు 300 మంది వృద్ధులను కలుసుకుని, 1200 పంక్తుల గీతాలను సేకరించారు. వీటిలో యిరవై పంక్తులు మాత్రమే యింతకు ముందర జానపద కవితకు ఉదాహరణగా ప్రచురింపబడ్డాయి. వాటి కర్త పేరు తెలియక పోవడంవల్ల.

క్రమక్రమంగా నజరోవ్ కవి జీవితం గురించి కూడా భోగట్టాను సేకరించారు. కరీం దెవానా ఒక గుడిసెలో కాపుర ముండేవారు, చినిగిన గుడ్డలు వేసుకునేవారు. ఆయన తన పాటలు పాడుకుంటూ గ్రామంనుండి గ్రామానికి. బజారునుండి బజారుకూ తిరిగేవారు. ప్రపంచ సంపదలలో తనకువంతుగా లభించినదల్లా తన గాడిద మాత్రమేనని, ఒకపాటలో ఆ కవి చెప్పారు. ఆ గాడిదమీదనే దెవానా కొండదారుల వెంబడిని గ్రామ గ్రామానికి వాడవాడలకూ వెళ్లారు

ఉదరపోషణార్థం కరీం దెవానా, పురాతన కాలపు ముగ్గింగిల గ్రామస్తుని వద్ద ఆయన ఒకటి రెండు నెలలు కూలిక వుండేవారు యిజమాని యింట్లో భోజనమూ. కొంత కుద్దయి గుడ్డ వచ్చేది. ఈ గుడ్డను ఆయన తరువాత బజారులో అమ్మివేసేవారు.

కరీం దెవానా గీతాలన్నీ. జీవితదర్పణాలు. అవి యదార్థ విషయాల గురించి, యదార్థ వ్యక్తుల గురించి వుంటాయి. చాలా గీతాలలో దెవానా సామాన్య ప్రజలను అవమానపరిచి. దోచుకునేవారిని అపహాస్యంచేసి ఖండించారు. ఆయన వ్యంగ్య గీతాల "నాయకులు" న్యాయం లేని న్యాయాధికారులూ, దుర్గాహంతో వున వడ్డీ వ్యాపారస్తులూ, పన్నులు వసూలు చేసే క్రూరులూ. కొన్ని గీతాలు బొఖారా రాజును సైతం నిరసించాయి వాటిని పాడడం ప్రమాదకరం. సహజమే కవిని ఉరన్నా తీసేవారు, లేకపోతే రాళ్ళతో కొట్టి చంపడమైనా చేసేవారు. కాని కరీంను దెవానా అనేవారుగదా.

---

# జోడు బేరం

మొల్లా కంచరగాడిద దారితప్పి పోయింది. అది దొరకగానే ఒక రూబులుకు దానినమ్మివేస్తానని మొల్లా ప్రతిజ్ఞచేశాడు.



మర్నాడు కంచరగాడిద దొరికింది మొల్లాప్రతిజ్ఞ గురించి వినివున్న ఒకతను అతనితో యిలా అన్నాడు :



అంటే తజిక్ భాషలో పిచ్చివాడని. దెయ్యం పట్టిన వాడనీ అర్థం. దైవబలం వుంది, మానవుడు అంటడానికి వీలులేని యోగులుగా పరిగణింపబడేవారంటే ప్రజలకు యిష్టం. కరీం దెవానా, ఈ అస్పృశ్యతను పూర్తిగా ఉపయోగించుకున్నారు.

నజరోవ్ యిప్పుడు "కరీం దెవానా కొరకు అన్వేషణ" అన్న నవలను వ్రాస్తున్నారు. దెవానా గీతాలు తాను సేకరించినవాటిని ఆయన ముద్రణకు సిద్ధం చేస్తున్నారు. వాటిని రష్యనోనికి యస్. విప్కిన్ అనువదించారు తజిక్ కళా సారస్వతోత్సవం పరకి యివి ప్రచురింపబడ్డాయి.

ఇది ప్రారంభం మాత్రమే. ఈ ప్రజా మహాకవి గీతాలను యింకా సేకరించి, ఆయన జీవితానికి సంబంధించిన వివరాలను బాగా సంపాదించడానికి నజరోవ్ కృతనిశ్చయులై వున్నారు. ఇందుకు ఎక్కువగా తిరగాలి, చాలా మందిని కలుసుకోవాలి.

## ప్రాచీన సంబంధాలు

[1 వ పుట తరువాయి]

ఆఖరు విషయం. సోవియట్ తజికిస్తాన్లో చాలకాలంగా ఒక గిరిజనుల బృందం వుంటూ వున్నదనీ, వారు హిందీ పోలికలుగల ఒక భాషను మాటాడుతారనీ, వారీనాటివరకూ భారత దేశంతో తమకున్న సంబంధాల గురించి గాధలను చెప్పుకుంటుంటారనీ యిటీవలనే నిరూపింపబడింది.

భారత దేశం, తజికిస్తాన్లకు మధ్యగల సంబంధాలు అనేకం, గాఢమైనవి. అందువల్లనే తజిక్ ప్రజలూ, వారి శాస్త్రజ్ఞులూ భారతీయులు సాధించిన పలు విజయాల గురించి అంత గాఢమైన ఆసక్తిని చూపుతున్నారు. మన ప్రభుత్వాల శాంతియుత విధానాలు సోదర భారత మహాప్రజలతో సాంస్కృతిక, వైజ్ఞానిక సంబంధాలు అపూర్వంగా వర్ధిల్లడానికీ, పటుతరం గావడానికీ తోడ్పడుతువందుకు వారు ఆనందిస్తున్నారు

## రాబోవు సంచిక

**10 జూన్, 1957**

బాల రక్షణ అంతర్జాతీయ దినోత్సవము, 1 జూన్ 1957న జరుగుతుంది. ఈ సందర్భాన్ని పురస్కరించుకొని, సోవియట్ బాలల జీవిత రీతుల కొన్నింటిని, 10 జూన్ 1957న రాబోవు 'సోవియట్ భూమి' పాఠకులకు పరిచయం చేస్తుంది ఇంకా, సభాపతి వొరొషిలోవ్ ఇండొనేషియా సందర్శన గురించిన సచిత్ర వ్యాసం, సోవియట్ ఎన్నికలు, వ్యవసాయం, కళ, సాహిత్యాల గురించిన వ్యాసాలు, అంతర్జాతీయ సమీక్ష, ప్రశ్నోత్తరాలు. దున్నో సాహస కృత్యాలు మొదలైన శీర్షికలు, చిత్రాలు వుంటాయి.

---

"రేపు నీ కంచరగాడిదను ఒక రూబులుకు నువ్వు అమ్మితే సరేసరి, లేకపోతే మాటతప్పినందుకు అందరి ముందరా నీ పరువు తీసివేస్తాం."

మొల్లా కాస్సేపాలోచించి, ఒక పిల్లిని పట్టుకున్నాడు. దానిని కంచరగాడిద మెడకుకట్టి బజారుకు వెళ్లాడు.

బేరగాళ్లు కంచరగాడిదను ఎంతకిస్తావని అడిగితే, మొల్లా యిలా బేరం చెప్పాడు:

"కంచరగాడిద ఖరీదు ఒక రూబులు. పిల్లి ఖరీదు నూరు రూబుళ్ళు. రెండింటిని కలిపి అమ్ముతాను."



# అత్యున్నత బహుమతి

వ్లాదిమిర్ ఇల్యిచ్ లెనిన్ 87వ జన్మ దినోత్సవాన—ఏప్రిల్ 22న—లెనిన్ బహుమానాల ప్రదానం గురించి చేయబడిన నిర్ణయం ప్రకటింపబడింది. లెనిన్ బహుమాన స్వీకృతుడు అన్న ఉన్నత బిరుదు ప్రముఖ విజయాలను సాధించినందుకు సోవియట్ శాస్త్రజ్ఞులకూ, పరిశ్రమలలోనూ, కళాసారస్వతాలలోనూ పని చేసేవారికీ యివ్వబడింది.

లెనిన్ బహుమానం సోవియట్ దేశంలో యాదృచ్ఛికంగా ఉన్నత బహుమానం కాదు. తమ సృజనాత్మక కార్యకలాపాలన్నిట్లోనూ, ప్రతి ఒక్క శ్రమవిజయంలోనూ లెనిన్ పథకాల పరిపూర్తినీ, లెనిన్ అమరభావాల విజయాన్ని సోవియట్ ప్రజలు తప్పక వీక్షిస్తారు. సోషలిస్టు దేశం స్థాపింపబడిన తొలిదినాల నుండీ ప్రజలకూ, వారి విశాలమైన, వివిధమైన అవసరాలకూ, ప్రయోజనాలకూ సేవ చేసే శాస్త్ర, కళాసృష్టి గురించి లెనిన్ కలలు గన్నారు. పూర్తిగా నిరక్షరాస్యతవుండే దేశంగా—అపూర్వమైన సాంస్కృతిక విప్లవం సాధింపబడిన దేశంగా, ప్రజలలోనుండి నిజమయిన నూతన శ్రామిక బుద్ధిజీవులు ఉద్భవించిన దేశముగా భావి రష్యా గురించి లెనిన్ కలలు గన్నారు. అక్టోబరు సోషలిస్టు మహా విప్లవం యొక్క నలభైయవ వార్షికోత్సవం ఆసన్నమైన యిప్పుడు, సోవియట్ ప్రజలు తాము లెనిన్ ఆదేశాలను పూర్తిచేశామనీ, అభివృద్ధి చెందిన సోవియట్ సంస్కృతి ప్రజల ప్రయోజనాలకు సేవచేస్తోందనీ, దేశ ఆత్మిక సంపదలను పెంపొందిస్తోన్నదనీ చెప్పుకోగలరు.

లెనిన్ బహుమానాలకు అర్హత సంపాదించిన రచనలు అతి భిన్న భిన్న పద్యా. కళారంగాలకు చెందినవి. ఈ బహుమానం కొరకు నివేదింపబడిన తరవాత వాటిని శాస్త్రజ్ఞ, ఇంజినీర్లు, కళారంగంలో సేవచేసేవారూ, యావత్ప్రజలూ క్షుణ్ణంగా పరిశీలిస్తారు, చర్చిస్తారు. వాటిలో చాలా యిప్పటికే ఆచరణలో పరీక్షింపబడ్డాయి.

### పరమాణు కేంద్ర నిర్మాతలకు

1954 వేసవిలో ప్రపంచానికి మొదటి సారిగా పరమాణుశక్తి కేంద్రం పని మొదటి సారిగా పరమాణుశక్తి కేంద్రం పని మొదలు పెట్టింది. అది పరమాణు శక్తి ఇంజినీరింగ్ అభివృద్ధిలో ఒక నూతన శకాన్ని ప్రారంభించింది. అది గత రెండేళ్ళుగా వ్యవసాయానికి అవిచ్ఛిన్నంగా విద్యుచ్ఛక్తిని సరఫరా చేస్తోంది. డి బ్లొకింత్సెవ్ నాయకత్వాన ఈ స్టేషన్‌ను డిజైన్‌చేసి, నిర్మించిన యింజినీర్ల బృందానికి లెనిన్ బహుమానం బహూకరింపబడింది.

### నటీమణికి

గాలీనా ఉలనోవా పాటలేస రష్యన్ నర్తకి. అధునాతన కాలపు గొప్పకాలపు నర్తకీమణులలోనూ, నటీమణులలోనూ ఒకతె. ఇప్పుడామె లెనిన్ బహుమానాన్ని పొందింది. ప్రజలకు సన్నిహితమై, సుబోధకంగావున్న ఉలనోవా సృష్టించిన రమణీయమైన, మనోహరమయిన భావచిత్రాలు సోవియట్ నాట్యకళను ఒక నూతనమైన, ఉన్నతతరమైన స్థాయికి తీసుకపోయాయి.

### గని కార్మికులకు

భూగర్భంలో ధీరుడైన అన్వేషకునిగా ఇవాన్ పిలిపెంకో పనిని మొదలు పెట్టారు. బుద్ధికుశలత, సమయజ్ఞతగల యువకుడైన యీ గని కార్మికుడు, గని నిర్మాణ పద్ధతిలో చాలా కొత్త కొత్త విషయాలను ప్రవేశపెట్టారు. పిలిపెంకో దళంలోని గని కార్మికులు ఒక యింజినీర్ల బృందంలో కలసి ప్రపంచమంతటికీ నవ్యమైన షాఫ్టు-సింకింగ్ పద్ధతిని తయారు చేశారు: ఒక నెలలో వారు ఒక షాఫ్టును 212 మీటర్ల లోతుకు దింపారు; ఒకే సారిగా షాఫ్టు సింకింగ్, స్తంభాలు పెట్టేపద్ధతి గని నిర్మాణంలో నిజమైన విప్లవం, యిది యీ పనికి గొప్ప త్వరితగతిని చేకూర్చింది. అందుచేతనే పిలిపెంకోతోబాటుగా షాఫ్టు-సింకింగ్ పద్ధతులను అభివృద్ధి చేయడానికి కృషి చేసిన వారందరికీ యిప్పుడు లెనిన్ బహుమానం వచ్చింది.

### రష్యన్ వాగ్గేయకారునికి

గొప్ప రష్యన్ వాగ్గేయ కారులలో ఒకరైన సెర్గీ ప్రొకొఫీవ్ చాలా ఏళ్ళక్రితం, సోవియట్ సంగీత వేత్తలను విడచి కీర్తిశేషులయ్యారు. ఆయన ఏడవ (తుది) సింఫనీ ఆదర్శ యువజనులకు అంకితం చేయబడింది. కమ్మదనమూ, రూపంలో స్పష్టత గలిగి, కవితా భరితమై, వీరభావయుతమైవున్న ఏడవ సింఫనీ యీ కాలపు అత్యంత ప్రసిద్ధరచనలలో ఒకటి. దీనిని సృష్టించినందుకు సెర్గీ ప్రొకొఫీవ్ తన మరణానంతరం లెనిన్ బహుమాన స్వీకృతుడన్న బిరుదానికి అర్హతను సంపాదించుకున్నారు.

### విజ్ఞానవేత్తలకు

సిద్ధాంత జ్ఞానాభివృద్ధికి గొప్ప ప్రాముఖ్యం గల వైజ్ఞానిక పరిశోధనలు చేసినందుకు చాలా లెనిన్ బహుమానాలు యివ్వబడ్డాయి. గత యిరవై ఏళ్ళలో పరమాణు పదార్థ విజ్ఞానశాస్త్ర రంగంలో ఒక అత్యంత ప్రముఖ విషయాన్ని కనుగొన్నందుకు—పేరామాగ్నటిక్ రిసొనెన్స్ గురించి—సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు కరెస్పాండింగ్ సభ్యుడు ఇ. జవోయిస్కీకి లెనిన్ బహుమానం యివ్వబడింది. సోవియట్ దేశ విజ్ఞానశాస్త్ర పరిషత్తు కరెస్పాండింగ్ సభ్యుడు పి. నోవికోవ్ గణిత శాస్త్రరంగంలో చేసిన ముఖ్యమైన సిద్ధాంత పరిశోధన, అధునాతన గణితశాస్త్రమంతటికీ ఎంతో విలువగలది. అందుకు ఆయనకు కూడా లెనిన్ బహుమానం లభించింది.

### భూగర్భ శాస్త్ర పట నిర్మాతకు

అకెడిమీషియన్ డి నలివ్కిన్ పెద్దపనిని సాధించారు. ఆయన 1: 2,500,000 ప్రమాణంతో సోవియట్ దేశ భూగర్భశాస్త్ర పటం ఒకదానిని తయారు చేశారు. దేశ భూభాగం యావత్తుగల మొదటి భూగర్భశాస్త్రపటం యిదే. ఇటీవలి సంవత్సరాలలో సోవియట్ దేశ భూగర్భ నిర్మాణ పరిశీలనలో సాధింపబడిన గొప్ప విజయాలనిది ప్రతిబింబిస్తుంది గత ఏడాది మెక్సికోలో జరిగిన భూగర్భశాస్త్రజ్ఞుల మహాసభలో యీ అసాధారణ పటం గొప్ప ప్రశంసలను అందుకొని, అధునాతన భూగర్భ పటరచనకు ప్రముఖ దృష్టాంతంగా గుర్తింపబడింది.

### జెట్ విమాన నిర్మాతకు

సోవియట్ విమాన నిర్మాణశాస్త్రానికి అకడిమీషియన్ తుపొలెవ్ దీక్షతో సృజనాత్మకంగా అనేక సంవత్సరాల కృషిని అర్పించారు. ఈ విజ్ఞానవేత్త ధీరభావాలకు మకుటం, తు-104 జెట్ విమానం. పౌరవిమాన నిర్మాణశాస్త్రంలో సాధించిన సరికొత్త విజయాలపైన ఆధారపడిన తు-104 విమానం దేశాలకూ, ప్రజలకూ మధ్య గల దూరాలను చాలవరకూ తగ్గించి వేసింది.

ఈ విమాన నిర్మాణానికి ఎ. తుపొలెవ్ లెనిన్ బహుమానానికి అర్హత సంపాదించుకున్నారు.

*పలు రంగాలలో ప్రసిద్ధులకు*

లెనిన్ బహుమాన స్వీకృతులలో మారుమూల యాకుతియాలో వజ్రాలను కనుగొన్నవారూ, కజకస్తాన్లో అపారమైన ముడి యినుమును కనుగొన్నవారూ అయిన శాస్త్రజ్ఞులున్నారు. ట్రాన్స్ కకాసస్ ప్రజల ప్రాచీన చరిత్రను పరిశోధించినందుకు ప్రొఫెసర్ మెలికిష్విలీకీ, తీవ్ర వ్యాధులకు కారణమైన మానవ, మృగ శరీరాలలోని ప్లాట్ నర్మ్స్ పారసిటిక్ అన్న క్రిముల సంహారానికి సాధనాలను అన్వేషించడంలో నిమగ్నులైన అకెడిమీషియన్ స్క్రియబిన్‌కూ బహుమానాలు వచ్చాయి. ఈ ప్రముఖ క్రిమి శాస్త్రజ్ఞుడు యీ విషయంపైని వ్రాసిన పన్నెండు సంపుటాలలో, పరాన్నభుక్కులైన క్రిములగురించి వివరాలూ, వాటిని అరికట్టే సాధనాలూ వున్నాయి. రొమానిక్ భాషా శాస్త్రం గురించి అనేక సంవత్సరాలు చేసిన పరిశోధనలకు అకెడిమీషియన్ షిష్మరేవ్‌కు కూడా ఒక లెనిన్ బహుమానం వచ్చింది. ఒక మీటర్ మందంగల లోహాన్ని వెల్డింగుచేసే పద్ధతిని కనుగొన్న వెల్డర్లకు కూడా యీ బహుమానం లభించింది.

*శస్త్ర వైద్యానికి*

అధునాతన వైద్యశాస్త్రం మానవ శరీరంలోని రహస్యాలను నానాటికీ యెక్కువగా అన్వేషిస్తోంది. మెదడు, గుండెవంటి అతిక్లిష్ట నిర్మాణాలైన లోలోపలి శరీరభాగాలు, శస్త్ర చికిత్సకు అందుబాటులోనికి యిప్పుడు తీసుకరాబడుతున్నాయి. సోవియట్ దేశ వైద్యశాస్త్ర పరిషత్తు అధ్యక్షుడు, శస్త్ర వైద్యుడు అయిన ఎ. బకులెవ్ హృదయానికీ, పెద్దరక్తనాళాలకూ ఆజన్మంగానూ, ఆ తరవాతనూ వచ్చే వ్యాధుల శస్త్ర చికిత్సా పద్ధతులను కనుగొన్నందుకు లెనిన్ బహుమానాన్ని పొందారు. హృదయం పైని ఆయన, ఆయన సహాయకులు ధైర్యంగా చేసిన ఆపరేషన్లు వందలాది మంది ప్రాణాలను కాపాడాయి.

*ఖగోళ శాస్త్రజ్ఞునికి*

సోవియట్ దేశంలోని అన్ని పెద్ద ఖగోళ పరిశోధనాలయాలలోనూ ప్రతిభావంతుడైన డిజైనర్ బగ్రత్ అయొన్నిసియానీ తయారు చేసిన ఖగోళశాస్త్ర పరికరాలు కనిపిస్తాయి. ఇప్పు డీయనకు లెనిన్ బహుమానం లభించింది. ఈ సరికొత్త పరికరాలు ముఖ్యమైన చాలా పరిశోధనలను చేయడానికి శాస్త్రజ్ఞులకు తోడ్పడ్డాయి. ప్రస్తుతం అయొన్నిసియానీ ప్రపంచం అంతటికీ పెద్దదైన, 120 టన్నుల గల, బలవత్తరమైన టెలిస్కోప్‌కు ముఖ్య డిజైనరుగా వున్నారు. దీని పెరబోలిక్ మిర్రర్ బరువు నాలుగుటన్నులు. భూ భ్రమణాన్ననుసరించి యీ టెలిస్కోపు సరిగ్గా ఒక క్రోనోమీటరుకు తిరుగుతుంది.

లెనిన్ బహుమానాలను అందుకొన్నవారి కృషి క్లిష్టమైనది, వైవిధ్యంగలదీ. మా పత్రికలో వారిలో చాలా మంది గురించి మీకు తెలియడాయడానికి ప్రయత్నిస్తాము. బేరింగుల తయారీకి ప్రపంచంలోకల్లా మొదటి స్వయంచలిత కర్మాగారం గురించి, ప్రసిద్ధ సోవియట్ రచయిత లియొనిద్ లియొనోవ్ "రష్యన్ అరణ్యం" అన్న నవలగురించి, ప్రఖ్యాత శిల్పి, సోవియట్ దేశ ప్రజాకళాకారుడు అయిన సెర్గీ కొనెన్కోవ్ గురించి రాబోయే కొన్ని సంచికలలో మీరు చదువుతారు.

సోవియట్ దేశ స్థాపకుడు లెనిన్ ఘన నామాంకితమైన యీ పారితోషికాల బహూకరణ, విజ్ఞానశాస్త్రం, ఇంజినీరింగ్, సారస్వత కళారంగాలలో పనిచేసేవారు సోవియట్ ప్రజలకు చేసిన గొప్ప సేవలకు యివ్వబడిన ఒక నూతన గౌరవం.

# మిత్రునికి

### కరీం దెవొనా

సోదరులారా, ఈ రాత్రి చెప్పుకుంటాను స్నేహితునికి
మనసువిప్పి సంతోషంగా, నా స్వగతాన్ని, గతాన్ని
అవమానానికి, లేమికి, దారిద్ర్యానికి ఎరైన నా జీవితాన్ని;
ఎదుర్కుంటూ నీ రాత్రి లజ్జాకర నేత్రాలతొ ప్రపంచాన్ని.

వేటాడు తున్నది వాంఛ ములుకువోలె క్షుధితహృదిని
తెలుసుకుంటావులే నువ్వూ నాదుర్దశ, కంట తడిబెడుతూ ఈరాత్రి!

కడ ఊపిరి విడిచిపెట్టానంటె భూనభోంతరాళమ్ముల
కలయబెడుతుంది నా వ్యథిత హృదయ నిశ్వాసం
కాల మేఘ గర్జారవమై రోదిస్తుంది మింట—
గాయకుడు నిద్రిస్తున్నా డీ రాత్రి, నా కంటికి లేదు కూర్కు.

రోజా తోడు విడిన బుల్‌బుల్ పిట్ట విలపిస్తున్నది
ఈ రాత్రి నేను ప్రార్థిస్తాను, పునస్సమాగమ ప్రాప్తికి.

సత్యం యెక్కడ దొరుకుతుందో నే నెరుగను
అయినా దుఃఖావిలమైన ఈ రాత్రి దాన్ని కనుక్కొంటాను!
లైలా వీధిలో దూశారు నా గుండెలలో బాకును
ఈ మైదానపు నిశీధాన బాధపడుతున్న మజ్నూను నేను.

అల్లంత దూరాన వెలుగు, వీధి దీప శిఖలాగున
జ్వలిస్తాను యీ రాత్రిన బాధానల కీలల.

మస్రాబ్ లాగా కార్చుతాను రక్తాశ్రు బిందువులు
పూ నాళికలన్నీ నింపుకోను మధురాసవముః
పరిత్యక్తుడు బెదిల్లాగ బాధను ముంచెత్తెద కన్నీటను
వెక్కివెక్కి ఏడుస్తా నీరాత్రి నా విరచించే గీతంలో వేదన నించను.

హాఫిజ్‌ను బాధించినట్టు, నన్నూ హింసించావీ రాత్రి
నీ మంత్రం పారి నా గుండె విలవిల తన్నుకొంటున్నది
ఉన్మత్త పథికుడు కరీం, మజ్నూన్‌లా సంచరిస్తున్నాడు కొండకోనల
అవరించిన చీకట్లలో వెదుకుతున్నాడు ప్రభాత కాంతుల.



వి. కులందా

# తజిక్ పోలో



యిబోజీ" అన్నది. తజికిస్తాన్లో ఆడే పోలో ఆట పేరు. పామీర్ ప్రాంతాల్లో నివసించేవారి అభిమాన క్రీడలలో యిదొకటి. నిజమే యీ తజిక్ ఆట నియమాలు (ఆ భాషలో "గుయ్", "బోజీ" అన్న మాటలకు "బంతి", "ఆట"అని అర్థం), భారత దేశంలో ఆడే పోలో నియమాలంత స్పష్టంగా నిర్వచింపబడి వుండలేదు. అయినా పామీర్ ప్రజలు, అబాల గోపాలం ఒకే విధంగా యీ క్రీడను ఆడుతూనే వుంటారు.

తజికిస్తాన్ క్రీడా చరిత్రకారుడు, విజ్ఞాన శాస్త్రంలో మాస్టర్ డిగ్రీని పొందిన పండితుడూ అయిన యాకుబ్ అబ్రమోవ్, పామీరు జిల్లాలలో పోలో శతాబ్దాల క్రితం ఆడుతూ వున్నట్టుగానే యిప్పుడుకూడా ఆడుతూ వున్నారని చెబుతున్నారు. ఇరాన్లోనూ, తజికిస్తాన్లోనూ మధ్య యుగాలలో పుట్టి యీ పోలో భారత దేశానికి వ్యాపించింది. అక్కణ్నుండి బ్రిటను మొదలైన యూరోపియన్ దేశాలకు వెళ్ళింది.

పామీర్ వేరుపడి వుండడం మూలంగా, శతాబ్దాలుగా తమ పూర్వీకుల ఆచార వ్యవహారాలను స్థానిక ప్రజలు భద్రపరచుకోవడానికి అవకాశం కలిగింది. మిగతా తజికిస్తాన్లో యీ ఆచార వ్యవహారాలు దండయాత్రలు, ఆక్రమణలు, యిరుగు పొరుగు ప్రజల సంస్కృతీ సంపర్కం మూలంగా తరచుగా మారిపోతూ వుండేవి. పామీర్లలోని వృద్ధులకు—అప్పుడప్పుడు వీరిలో నిరక్షరాస్యులుకూడా కనిపిస్తుంటారు—మధ్య యుగాల మహాకవులైన రుదకీ, ఫిర్దూసీ, హాఫిజ్, సాది గీతాలు కంఠస్థమై వుండడం అకారణమేమీ కాదు.

* * *

మార్చి నెలలో ఒక ఆదివారపు సాయంత్రము నేను గుయ్‌బోజీ ఆటను చూశాను. తజికిస్తాన్ బయళ్ళలో బాదంచెట్లు విరియ కాసివున్నాయి. కాని ఇక్కడ, పామీర్ పర్వతాలలోని కగనోవిచ్ సమిష్టి క్షేత్రంలో మంచు దట్టంగా పడివుంది యింకా. కర్షక క్రీడాకారులు మంచు కప్పివున్న పొలంలో ఆడడానికి నిశ్చ



# గుయ్ బోజీ



యించుకున్నారు. ఆ లోయలో పచ్చగడ్డి మొలిచేదాక ఆగి వుండడానికి వారికి ఓపిక లేదు.

ఆటగాళ్లకు నాయకుడు వృద్ధుడైన బందీ షో. ఈయన గొయ్‌బోజీకి పాతకాపు. ఆటగాళ్ళు ఒకవేపున ఒక సందుకు, యింకోవేపున ఒక చిన్నవాగునూ సహజమైన సరిహద్దులుగా పెట్టుకున్నారు. ఆటస్థలం మధ్యలోకి వారు గుర్రాలమీద వెళ్లారు. ఒకొక్క రౌతు చేతిలో మీటరు పొడవుగల కర్ర ఒకటుంది. అందర్లో వయస్సు ఎక్కువగల యిద్దరు ఆటగాళ్ళు రెండు జట్లకు నాయకత్వం వహించారు. అందులో ఒకరు టాసు గెల్చుకొని, తన జీనుపైనుంచి కాస్తగా వంగి కర్ర బంతిని కొట్టాడు, మిగతా ఆటగాళ్లు పరుగులెత్తారు. ఆట సాగిపోయింది.

రౌతులు. తమ ఎదుటి పక్షపు సరిహద్దు మీదుగా బంతిని కొట్టడానికి ప్రయత్నించారు. తమ పక్షంలోని వారు తీవ్రంగా దాడిచేస్తున్నప్పుడు, కొందరు ఆటగాళ్ళు తమ సరిహద్దుకు దగ్గరగా కాచుకుని ఉన్నారు.

ఆటలో ఒక గంటకుపైగా విజయం తారుమారు అవుతూ వచ్చింది. ఆటగాళ్లు అలసిపోయి విశ్రాంతి తీసుకుందామనుకున్నారు. కాని పోటీ పదినిమిషాల తరవాత మళ్లీ మొదలైంది. ఈ పోటీని చూడడానికి నాతోబాటుగా వచ్చిన క్రీడా సంఘం సిబ్బంది సభ్యుడు గుయ్‌బోజీ ఆట అప్పుడప్పుడు నాలుగైదు గంటలు సాగుతుందనీ, ఆటగాళ్లు తమ గుర్రాలను తరుచుగా మార్చుకుంటూ వుంటారనీ నాతో చెప్పాడు. పెద్ద పండగల్లో ఒక జట్టులో యిరవైనుండి ముప్ఫయిమంది దాకా ఆటగాళ్ళుంటారు. పిల్లలు కూడా అప్పుడప్పుడు గుయ్‌బోజీ పోటీలు జరుపుకుంటారు. కాని వాళ్ళు గుర్రాలకు బదులుగా గాడిదలెక్కి ఆడతారు.

పామీర్లలో నివసించే వారి జీవితములో తజీక్ పోలో శాశ్వతమైన స్థానాన్ని సంపాదించుకుంది.

రచయిత: ఎన్. నొసోవ్ చిత్రకారుడు: ఎ. లప్త్యేవ్

వొత్తని తూలికా తల్పంమీద పడుకుని వున్న డున్నో మేలుకొన్నాడు. కళ్ళు విప్పి చుట్టూరాచూస్తే, తానొకవింత గదిలోవున్నట్టుతెలిసింది. గడ్డి పూవు అన్న ఒక తపుటి పురుగమ్మాయి, తెల్లకోటూ టోపీ వేసుకుని, చిన్న గోధుమ రంగు సంచీని చేత బుచ్చుకుని యింకో తపుటి పురుగమ్మాయి అదేక్షణాన గదిలో కొచ్చారు. ఆమెవి గుండ్రంగా, ఎఱ్ఱగావున్న చెక్కిళ్ళు. బూడిదరంగుకళ్ళూ. కొమ్ము చట్రవు కళ్ళద్దాల వెనకనుండి మీవే పుగా చూసే కళ్ళవి. ఆ అమ్మాయి మధుభక్షి అనుకున్నాడు, డున్నో.



మధుభక్షి డున్నో మంచందగ్గరికి ఒక కుర్చీ లాగి తెచ్చుకుని, దానిమీద తన సంచీని పెట్టి, తల ఊపుతూ అందిగదా—

"అయ్యో, మీ తపుటి పురుగబ్బాయిలు' మీరెంత అల్లరిపిల్లలు! ఎప్పుడూ పెంకెతనమే! ఆ బెలూన్లో మీరెందుకు వెళ్ళినట్టు! సరే, నోరు విప్పవద్దు! నువ్వేమంటావో నాకు తెలుసు —"మరెప్పుడూ మళ్ళీ చెయ్యనంటావు!"

"పక్కమీంచిలే" అంది అమ్మాయి.

డున్నో మంచంమీంచి ఒక పాదం బయట పెట్టాడు.

"మంచందిగొద్దు! కూర్చోమనిచెప్పాను." డున్నో విసుక్కుని కూచున్నాడు.



"విసుక్కోకు. నాలిక చూపించు" అంది మధుభక్షి.

"ఎందుకూ ?"

"ప్రశ్నలడగొద్దు. నాలిక చూపించు." డున్నో నాలిక బయటికి తీశాడు.

"ఆ–ఆ–ఆ–ఆ అను"

"ఆ–ఆ–ఆ–ఆ" అన్నాడు డున్నో.

మధుభక్షి తన సంచిలోంచి ఒక కర్ర బాకాను బయటికితీసి అతని గుండె, ఊపిరితిత్తులు కొట్టుకోవడం వింది.

"బాగా ఊపిరితియ్యి."

డున్నో స్టీం యింజిన్లా ఊపిరి తియ్యడం మొదలుపెట్టాడు.

"ఇక ఊపిరితియ్యడం ఆపు

"హీ-యీ-యీ !" నవ్వాడు డున్నో.

"ఎందుకు నవ్వుతున్నావు ? నేను నవ్వు మాటలేమీ ఆడలేదే."

"నేను ఊపిరి తియ్యడం మానెయ్యడం ఎలాగ ?" అన్నాడు, యింకా నవ్వుతూ.

పరీక్ష అయిపోయాక మధుభక్షి, గడ్డి పువ్వుకు యిలా చెప్పింది—"మందులషాపుకెళ్లి ఒక తేనేపట్టీమందు కొనుక్కురా. డున్నోను లేవనివ్వకు. లేచాడంటే నీ పళ్ళాలన్నీ ముక్కలు చేసేస్తాడు, ఎవర్నయినా నెత్తిమీద మొత్తేస్తాడు. తపుటి పురుగబ్బాయిల విషయంలో ఖచ్చితంగా వుండాలి."

మధుభక్షి తన బాకాను దూరంగాపెట్టేసి, యింకోసారి డున్నోవేపు చూసి బయటికెళ్ళిపోయింది.

గడ్డిపువ్వు మందు చీటీ తీసింది.

"ఆవిడేం చెప్పిందో విన్నావా? నువ్వు లేవకూడదు" అని గడిపువ్వు గదిలోంచి వెళ్ళిపోయింది.

## కొత్త నేస్తాలు

గడ్డిపువ్వు బయటికి వెళ్లాక, డున్నో కాస్సేపు చడీ చప్పుడూ లేకుండా ప్రక్కమీద పడుకున్నాడు. ఇక లేవబోతూవుంటే తలుపుకావల అడుగులచప్పుడు, ఎవరో గుసగుసలాడడమూ విన్నాడు.

"ఎక్కడున్నాడు ?"

"లోపల."

"ఏం చేస్తున్నాడు."

"పడుకున్నాడు."

డున్నో తలుపువేపు చూసి, ఎవ్వరో తాళపుకన్నంగుండా చూస్తున్నారనుకున్నాడు.

అతను ప్రక్కమీంచి గభాలున లేచి వెళ్ళి బారుగా తలుపు తెరిచాడు. అది దేనికో తగిలినట్టు చప్పుడయ్యింది. అతనికి యిద్దరు తపుటి పురుగమ్మాయిలు కనిపించారు. వారు తప్పుకుని, తలలు పట్టుకుంటూ పారిపోయారు.



డున్నో చెవివెనక గోక్కున్నాడు.

"మంచి బాగా పలకరించాను!" అని గొణుక్కున్నాడు. "వాళ్ళకి తలుపుతో మంచి కాజా తినిపించినట్టున్నానే."

ఈ వింత యింట్లో తాను యింకా ఎక్కువ అల్లరి చేస్తానేమోనన్న భయంతో, అతను మళ్ళీ మంచం ఎక్కి, నిద్రపోవడానికి ప్రయత్నించాడు. అప్పుడే యెవరో వస్తున్నట్టుగా అడుగుల చప్పుడయ్యింది వసారాలో. తలుపు తెరుచుకుంది. యింకో తవుటి పురుగమ్మాయి లోపలికి తొంగి చూసింది.

"అల్లరి పిల్లవాడా! అల్లరిపిల్లవాడా!" అని అమ్మాయి కేకేసింది.

వెంటనే తలుపు దభాలున మూసుకుంది.

డున్నో మంచంమీంచి దిగ్గునలేచి వసారాలోకి పరుగెత్తాడు. కాని అక్కడ ఒక పిట్ట మనిషికూడా లేదు.

"ఉండుండు, నా తడాఖా చూపిస్తాను!"



అని బెదిరించాడు.

దస్కుమీద నున్న ఒక రూళ్ళ కర్రను తీసి అతను తలుపువెనక దాక్కున్నాడు. ఎంతో సేపు దాక్కోకముందరే, తలుపు తెరచుకుంది. రూళ్ళకర్ర పడింది.

"అమ్మో!"

వచ్చినది గడ్డిపూవు.

"రూళ్ళ కర్రతో నన్నెందుకు కొట్టావు?" అని ఏడిచింది. తలపట్టుకుని. "నా నుదుటికి గాయ మయ్యింది!"

"అవదు" అన్నాడు డున్నో, తన వేళ్ళలో రూళ్ళ కర్రను ఠీంకుతో తిప్పుతూ.

"అవుతుంది, అవుతుంది! నా చర్మం ఎంత సున్నితమైందో నీకు తెలీదు! వెంట్రుకతో కొట్టినా నాకు గాయమైపోతుంది!" అని ఏడిచింది.

"దానికి కాస్త ప్లాస్టరు గుడ్డ అంటించు" అన్నాడు డున్నో హటాత్తుగా ఉద్రేకం వచ్చి. "మందుల షాపునుంచి నువ్వు ప్లాస్టరుతెచ్చావు గదూ?"

"అవును. కాని అది నీకోసం తెచ్చాను!"

"మనిద్దరికీ పనికొస్తుందిలే" అన్నాడు డున్నో.

ఆ అమ్మాయి క్రిందికి వంగి, దెబ్బ తగిలిన దగ్గర చూపించింది; డున్నో అంటించేశాడు.

"నిన్ను నేను కొడదామనుకోలేదు" అన్నాడు డున్నో.

"మరి ఎవర్ని కొడదామనుకున్నావు?"

డున్నో తనను వేళాకోళం చేసిన ఎవరో తవుటి పురుగమ్మాయి సంగతి చెపుదామనుకున్నాడు. కాని అది కట్టుకథగా గడ్డిపువ్వు లెక్క వేస్తుందేమోనని మానివేశాడు.

"ఎవరూ లేదు, ఎవరూలేదు. ఆ రూళ్ళ కర్ర దెబ్బకొట్టడానికి బాగుంటుందో లేదో చూదామనుకున్నాను."

"ఇక నా కమీజూ, షరాయీ యిచ్చెయ్యి" అని అడిగాడు.

"నువ్వు నీళ్లు పోసుకునేదాకా యివ్వను" అంది ఆ అమ్మాయి.

"ఇదుగో టూత్-బ్రష్షూ, టూత్‌పేస్టూ."

అతను బ్రష్షు తీసుకుని అశ్రద్ధగా ఒకటి రెండుసార్లు పళ్ళమీద పోనిచ్చాడు. తరవాత నోరు కడుక్కుని చేతులు సబ్బుతో కడుక్కున్నాడు. చేతులు కడుక్కున్నాక, సబ్బును మళ్లీ అరలో పెట్టేసి, ముఖం కడుక్కున్నాడు.

"కాదు! ముఖంకూడా సబ్బుతో కడుక్కో!" అంది గడ్డిపువ్వు.

"ఏడిసినట్టు వుంది! నేను కళ్లలో సబ్బు పెట్టుకోవాలను కుంటున్నావా?" అన్నాడు డున్నో.

సరే, సబ్బుతో ముఖం కడుక్కున్నదాకా నీబట్టలు నీకు దక్కవు!" అని తేల్చి చెప్పేసింది గడ్డిపువ్వు.

ఇక చేసేదేమీలేదు. అతను సబ్బుతో ముఖం రుద్దుకున్నాడు. కాని తొందర తొందరగా నురగ కడిగేసుకున్నాడు.

ఇప్పుడు నువ్వు ఎంతో పరిశుభ్రంగా, అందంగా వున్నావు" అంది గడ్డిపువ్వు. కాని తువ్వాలు మీద మురికిమరకలు చూసి "ఈసారి పోనీగదా అని వూరుకున్నాను. ఇకమీదట బాగా కడుక్కోవాలి."

తరవాత, అతని బట్టలు తెచ్చియిచ్చింది.

"బట్టలు వేసుకున్నాక మేడమీదకొచ్చి టీ తాగుదువుగాని. నీకు చాలా ఆకలవుతోంది గదూ?"

"మలమల మాడిపోతున్నాను" అని ఒప్పుకున్నాడు డున్నో. "ఏనుగని ఆ పాళంగా తినెయ్యగలను."

## తన ఘనకార్యాలు చెపుతున్నాడు డున్నో

డున్నో గబగబా దుస్తులు వేసుకుని, కీచుపెడుతున్న మెట్లమీదుగా మేడ యెక్కాడు. అక్కడతనికి టేబుల్ మీద బరాణీలూ, కేకులు, పిండివంటలూ, టార్టులూ, డవ్‌నటూ, మరబ్బాలూ, యింకా ఎన్నో కమ్మని వంటకాలతో నిండిన రకరకాల ప్లేట్లు క నిపించాయి. హాయిగా కూచొని తినడానికి డున్నోకు అంత ఎక్కువగా అక్కర్లేదు. ఇంకో నలుగురమ్మాయిలొచ్చారు. అతను వాళ్ళను పలకరించాడు.

"వీళ్ళు మా పొరుగువాళ్ళు, మిన్నీ, విన్నీ మార్గి, ఫ్లఫ్" అన్నాది గడ్డిపువ్వు.

డున్నో చుట్టూరా తవుటిపురుగమ్మాయిలు గుమిగూడారు.

"నువ్విక్కడికి బెలూన్‌లో వచ్చావా?" అనడిగింది, నల్లని జుట్టున్న మిన్నీ.



"అవును" అన్నాడు డున్నో దాబుగా టేబులును ఒకకంట కనిపెడుతూ.

"టేబులు దగ్గిరికిరా, టీ చల్లారిపోతోంది" అంది గడ్డిపువ్వు.

డున్నోను రెండుసార్లు పిలవనక్కర్లేదు. ఒక్కక్షణంలో, కూచొని నోటినిండా బరాణీలూ, కేకులూ, జామూ, మిఠాయీ కుక్కుకుంటున్నాడు. అతనితో వున్నవాళ్ళు చాలా తక్కువ తిన్నారు, బెలూన్ గురించి అన్ని సంగతులూ తెలుసుకుందామన్న ఆతృతకొద్దీ. చివరకి స్నిట్టీ ఉండబట్టక అడిగింది.

"గాలిలో బెలూన్‌లో వెళ్ళాలన్న ఉద్దేశం ఎవరికి పుట్టింది?"

"నాకు" అన్నాడు డున్నో, ఒకదాని తరవాత యింకో కేకును నోట్లో కుక్కుకుని అతి కష్టంగా దవడ ఆడిస్తూ.

"అలా చెప్పకు! నిజంగా నీకే ఆ ఉద్దేశం కలిగిందా?" అన్నారందరూ ఒక్కగొంతుతో.

"నేను అబద్ధం చెప్పను!" అన్నాడు

డున్నో. బెలూన్‌లు గొంతు దిగక ఉక్కిరి బిక్కిరవుతూ

"ఎంత బావుంది! దాన్ని గురించి అంతా చెప్పెయ్యి" అంది ప్లప్.

"చెప్పడానికేముంది ?" అన్నాడు డున్నో దర్పంగా. "తాము చెయ్యడానికి ఏదైనా పని ఆలోచించి చెప్పమని తవుటి పురుగులు నన్ను చంపేశారు 'ఏదన్నా ఆలోచించు. ఏదన్నా ఆలోచించు' అని వాళ్ళు ఒకటే పాట. 'మీ కోసం ఏదన్నా ఆలోచించడమంటే నాకు అసహ్యం. మీరే ఆలోచించుకోండి' అన్నాను నేను. 'మేమా ? ఏదేనా ఆలోచించడానికి మాకు సత్తా ఏదీ! నీకొక్కడికే మెదడుంది ! మెదడుంది! ఆలోచించడం నీకు అవలీల!' అన్నారు వాళ్ళు. 'సరే, సరే, యికతప్పదను కుంటాను' అని నేను ఆలోచించడం మొదలు పెట్టాను.

ఏదో మహా ఆలోచిస్తున్నట్టుగా ముఖంపెట్టి డున్నో ఒక బన్ను తీసి నమలడం మొదలు పెట్టాడు. తవుటి పురుగమ్మాయి ఆతృతగా కాచుకొని వున్నారు. బన్ను అయ్యాక, యింకొకటికోసం చెయ్యిచాస్తుంటే ఛిప్పీ మరి భరించలేక పోయ్యింది.

"ఆలోచించడం మొదలు పెట్టానని.... ఊహూ.... అంటున్నావు" అంది.

"అవును ఆలోచించడం మొదలెట్టాను." అన్నాడు డున్నో అప్పుడే కలలోనుండి మేలు కొన్న వాడిలా పోజుపెట్టి బన్ను టేబిలుమీద పెడుతూ. "మూడు రోజులూ, మూడు రాత్రులూ ఆలోచించాను. చివరికి నా స్నేహితులకిలా చెప్పాను: ఒరే అబ్బాయిలూ, చూడండి, ఒకటాలోచించాను. బెలూన్ గురించి ఆలోచించాను!' ఇక మేము బెలూను తయారు చేయడం మొదలు పెట్టాము."

డున్నో జాము రాసిన రొట్టె ముక్క ను లంకించుకున్నాడు.

"బెలూన్ ఎలా తయారు చేశారు ?" అని అడిగింది గడ్డిపువ్వు.

"అబ్బో, అది చాలా పెద్దపని. మీకేం అనుమానం అక్కర్లేదు. నాచేతిక్రిందివాళ్లు అహోరాత్రాలు పనిచేశారు. కొందరు రబ్బరుకు పూతపూశారు, కొందరు పంపుదగ్గర పని చేశారు. నేను ఈలవేసుకుంటూ పచారీచేశాను. ఈలవేయడమంటే ఈలవేయడంకాదు. వాళ్లకు పనులు పురమాయిస్తూ. నేన్లేకపోతే వాళ్లెవ్వరూ ఏదీ చెయ్యలేరు. నేను వాళ్లకు ప్రతి ఒక్కటీ బోధపర్చాలి. ఏమి చెయ్యాలో చేసి చూపించాలి. ఘోరమైన బాధ్యత. బెలూన్ ఏనిమిషాన్నయినా బ్రద్దలయిపోవచ్చునుగదా. నా క్రింద యిద్దరు పనివాళ్ళున్నారు, బెండం, ట్విస్టుం—గొప్పపనివాళ్ళు. తమ చేతులతో వాళ్ళు ఏపనైనా చేసేస్తారు—కాని తలలతో చెయ్యలేరు. ప్రతి ఒక్కటీ వాళ్లకు చూపించాలి, బోధపర్చాలి. అంచేత బోయిలర్ చేయడ మెలాగో వాళ్లకు బోధపర్చాను. తరవాత అది పనిచేస్తోన్న చప్పుడయింది, కాస్త! బోయిలర్ కుతకుతలాడింది. నీరు బుడగలు కడుతోంది. పైపుగుండా ఆవిరి బుసకొడుతోంది! అక్కడ ఎంత పెద్దమోత!"

ఆ పిల్లలు ఊపిరి బిగబట్టుకుని వింటున్నారు.

"చివరికి మేము బయలుదేరవలసిన రోజు వచ్చింది" అని సాగించాడు డున్నో.

మేము లోపలికెక్కాము. మేము మీదికి



బయలుదేరడానికి ముందుగా మేము యెలా బయలుదేరుతూ వున్నామో, చాలా కాలంవరకూ తిరిగి రామనీ మొదలైనవాటి గురించి నేను చిన్న ఉపన్యాసం దంచాను. తరవాత గుడ్‌బై కొట్టాను. తరవాత తుర్రున మీదికెళ్ళిపోయాం. పైకి, పైపైకి, దిగువ భూమి యీ రొట్టె ముక్కలా కనిపించే అంతవరకూ."

"ఇది నిజమే!" అని ఒగిర్చారు తవుటి పురుగు పిల్లలు.

"పెద్ద ఒట్టేసి చెపుతున్నాను" అన్నాడు డున్నో.

"మాట కడ్డంరాకు" అని కసిరింది గడ్డి పువ్వు "కథ చెప్పకుండా మీరు అడ్డు తగులు తున్నారు. అతను మనతో అబద్ధాలాడడు."

"అవును. మీరు నిజంగా నా కథకు అడ్డం రాకూడదు...."

"కానీ, కానీ!" అని అందరూ ఒకే గొంతుతో అన్నారు.

"తరవాత యిలా జరిగింది. మేము పైకి యింకా మీదికి, యింకా మీదికి యింకింకా మీదికీ పోతున్నాం. అప్పుడేమయ్యిందంటే. హఠాత్తుగా—ఢన్! బెలూన్ టక్కుమని ఆగి పోయింది. మేమొక మేఘంలో పడిపోయాం. మరేం చెయ్యాలి? నేను గండ్ర గొడ్డలితీసి, మేఘానికి కన్నం పెట్టాను. మళ్ళీ మేము మీదికి పోతున్నాం. కాని అప్పుడు తలక్రిందులుగా వెళ్తున్నాం—ఆకాశం మా కాళ్ళవేపుగా వుంది, నేల మా తలవేపుగా వుంది."

"ఎందువల్ల" అని అడిగేరు ఆశ్చర్యపడి శ్రోతలు

"అది ప్రకృతి సూత్రం" అన్నాడు డున్నో. "మేఘాలకు మీదుగా మీరు వెళ్ళినట్టయితే, అప్పుడు తలక్రిందులుగా ఎగురుతారు. వెళ్లాము, వెళ్ళాము, పైపైకి, పైపైకి అన్నిటికంటె మీది వరకూ. అక్కడ పరమ చలిగా వుంది, చెప్ప శక్యం కాని చలి—ఒక వెయ్యి ఒకటి పదో వంతు డిగ్రీలు సున్నకు తక్కువ. ప్రతిఒక్కటీ గడ్డ కట్టుకపోతోంది బెలూన్ చల్లబారిపోయి, క్రిందికి పడడం మొదలైంది. కాని నేను, అబ్బో బోలెడంత తెలివైనవాణ్ని. ఇది జరుగు తుందని నాకు బాగా తెలుసు. అంచేత ముందు గానే బెలూన్‌లో యిసుక నింపిన గోనెసంచులు కొన్ని పెటాను. మేము వాటిని ఒకటి తరవాత ఒకటి బయటికి విసిరేశాము అన్నీ. అయినా బెలూన్ పడిపోతూ వుంది. ఏంచెయ్యాలి? మాతో ఒకడున్నాడు, డూనో అన్నవాడు—వాడు కాస్త పిరికి. బెలూన్ పడిపోతూ వుండ డంచూసి వాడు గాభరా పడిపోయి ఏడవడం మొదలు పెట్టాడు. తరవాత గబాలున ఒక పేరాచూట్ తీసి బయటికి గంతేసి, చక్కా యింటికి పోయాడు. ఇప్పుడు బెలూన్ తేలిగ్గా వుంది, మళ్ళీ గాలిలోకి లేవడం మొదలు పెట్టింది. కాని యిది యెంతో సేపు జరగలేదు. అది చటుక్కుని కిందికి వచ్చి దభాలున నేలకు కొట్టుకుంది! అది మళ్లీ మీదకి గెంతింది! మళ్లీ నేలకు కొట్టుకుంది? నేను బయటపడి పోయాను—దుబ్బుమని!—తల క్రిందులుగా.

"తరవాతనేం జరిగింది ?" అనడిగారు వాళ్ళు.

"నాకు జ్ఞాపకం వున్న దంతే."



ఒక్కక్షణం ఎవ్వరూ

ఒక్కమాటయినా అనలేదు. తవుటి పురుగు అమ్మాయిలు, డున్నోను ఆశ్చర్యంతో చూస్తూ కదలక మెదలక కూచుండిపోయారు. వారి దృష్టిలో డున్నో నిజంగా వీరుడు.

"మీ బెలూన్ మమ్మల్ని హడలుగొట్టింది," గడ్డిపువ్వు చివరికి. అంది మేము బాల్కనీమీద టీతాగుతూవుంటే, ఒక పేద్ద బెలూన్ మా యింటిమీద పడుతూవుండడ కనిపించింది. హటాత్తుగా అది కంచమీదపడి పేలిపోయింది —ధన్‌మని. మేము దాని దగ్గరకు పరుగెత్తాము. కాని మాకు కనిపించిందల్లా కొండ రావిబెరడుతొట్టె ఒక్కటే."

"నువ్వు నేలమీద చచ్చినట్టుగా పడి వున్నావు"అని కలిపింది బుస్సీ.

"ఒకబూటు కాలికివుంది, యింకోటి కంచెమీదవుంది. నీటోపీ చెట్టుకొమ్మకు వేలాడుతూ వుంది"అంది చిస్సీ.

"నేను మంచంమీదికెలా వచ్చాను?" అని అడిగాడు డున్నో.

"మేమే వేశాము. రాత్రల్లా నిన్ను నేల మీద ఎలా వదిలిపెట్టేస్తాము?" అంది గడ్డి పువ్వు.

"నువ్వు చచ్చిపోయిన వాడిలాగా కని పించావు" అంది బుస్సీ. "కాని నాకు బల మైన—దాన్నేమంటారు?—శ-రీరం వుంది గాబట్టి పుళ్ళే కోలుకుంటావ"నంది మధుభక్షి.

"నిజం నాకు బలమైన శరీరంవుంది, కాని నాతలకాయ యింకా బలమైనది" అంటూ గప్పాలు కొట్టాడు డున్నో. "ఇంకెవరైనా అయివున్నట్టయితే, తప్పకుండా మెదడుకు దెబ్బతగిలి వుండేది."

"కాని బెలూన్‌లో యింకా ఎవరో వున్నారని అన్నావే?" అంది గడ్డి పువ్వు.

"అవును. పదహారుమందిమి వుండేవాళ్ళం. డూనో పారచూట్‌నుండి గంతేశాడు. యిక మిగిలినవాళ్ళు పదిహేనుమంది."

"వాళ్ళెక్కడున్నారు?"అని అడిగింది మిస్సీ.

"తెలియదు" అన్నాడు డున్నో.

సరిగ్గా అప్పుడే తలుపు తెరుచుకుంది, మంచుముక్క గదిలోకి పరుగెత్తుకొచ్చింది.

"ఈ కబురు విన్నారా?" అని అరిచింది. "అతి తాజా కబురు: ఇంకో బెలూను క్రింద పడి పేలిపోయింది. దాన్లో పద్నాలుగు మంది తవుటి పురుగు కుర్రాళ్ళున్నారు. కిందటి రాత్రి ఊరి పొలిమేరల్లో వాళ్ళు పడిపోయారు. మన వాళ్ళు వాళ్ళను ప్రొద్దుటేచూసి, ఆస్పత్రిలో పడేశారు."

"వాళ్ళు నాస్నేహితులై వుంటారు" అన్నాడు డున్నో. "నేను తిన్నగా ఆసుపత్రి కెళ్ళి కనుక్కుంటాను."

"నేనూ నీతో వస్తా" నంది గడ్డి పువ్వు.

---

ప్రశ్నోత్తరాలు

# సోవియట్ దేశంలో ఫిల్ము పరిశ్రమ

*ప్రశ్న: సోవియట్ దేశంలోని ఫిల్ము పరిశ్రమ పరిస్థితి ఏమిటి? ఒకొక్క రిపబ్లిక్కులో ఎన్నెన్ని ఫిల్ము స్టుడియో లున్నాయి? సోవియట్ ఫిల్ముల మొత్తం సంఖ్య యెంత?*

—శాంతి విజ్ఞానసమితి అధ్యక్షుడు, వింత పత్రవ: రఫీగ్ అహ్మద్, అలిఘర్; పెత్రిక్ అలెస్ డెలిన్ మొదలైన వారు.

*జబాబు: (ఎ. ఫెదరోవ్, సోవియట్ దేశ సినీమాటోగ్రఫి కేంద్ర కార్యాలయాధిపతి).*

సోవియట్ దేశంలో వ్యక్తుల సంస్థలు లేవు. ఫిల్ము పరిశ్రమ ప్రభుత్వ యాజమాన్యాన వుంది. ప్రతి యూనియన్ రిపబ్లిక్కుకు స్వంత ఫిల్ము పరిశ్రమ వుంది. రష్యన్ సమాఖ్య ప్రభుత్వానికి ఒక కథా చిత్రాలకు సంబంధించిన స్టుడియో, నాలుగు సులభవిజ్ఞానం స్టుడియోలూ, ఎనిమిది వార్తాచిత్రాల స్టుడియోలూ వున్నాయి. ఉక్రెయిన్‌కు రెండు కథాచిత్రాలకు సంబంధించినవి, ఒకటి వార్తా చిత్రాలది, ఒకటి సులభ విజ్ఞానానికీ స్టుడియోలున్నాయి. ఇతర రిపబ్లిక్కులకు ఒక కథా చిత్రాల స్టుడియో, వార్తా చిత్రాల స్టుడియో వున్నాయి. అన్నిటికంటె పెద్ద ఫిల్ము కర్మాగారాలు—మోస్ ఫిల్ము, గోర్కీ ఫిల్ము స్టుడియో, ప్రత్యేక ఫిల్ము స్టుడియోలైన మాస్కోలోని అనిమేటెడ్ కార్టూన్, ఎపిడియస్కోపిక్ ఫిల్ము స్టుడియోలు సోవియట్ దేశ మంతటికీ ప్రాముఖ్యం గలవి. సోవియట్ దేశంలో మొత్తం 34 ఫిల్ము స్టుడియోలున్నాయి. వాటిలో పందొమ్మిది కథా చిత్రాలనూ, మిగిలినవి వార్తా చిత్రాలనూ, సులభ విజ్ఞాన చిత్రాలనూ తయారు చేస్తాయి.

సోవియట్ దేశంలోని స్టుడియోలు 1955లో 65 కథాచిత్రాలను నిర్మించాయి. 1956లో సినీమా థియేటర్లలో దేశంలో తయారయినవి 80, యింత సంఖ్యలో విదేశాలవీ ఫిల్ములు ప్రదర్శింపబడ్డాయి. దీనికి వార్తా చిత్రాలను, సులభ విజ్ఞాన చిత్రాలనూ, విద్యా చిత్రాలనూ కలిపినట్టయితే సోవియట్ దేశంలో, 1956లో సినిమా థియేటర్లకు సుమారు రెండువేల ఫిల్ములు లభించాయి.

# తల్లులకు సలహా

## బిడ్డకు కసరత్తు



కసరత్తు 1 :

బిడ్డను వెల్లికిల పరుండబెట్టి, తల్లి బిడ్డ రెండుచేతులను పట్టుకొని, ఒకదానికొకటి దూరంగా పెట్టి, బిడ్డ చేతులను ఒకదాని తర్వాత ఒకటి రొమ్ము మీదికి (బండివాని ఊపులాగా) తెస్తుంది. ఈ సాధన, రొమ్ము కండరాలను బాగా అభివృద్ధి చేస్తుంది.

కసరత్తు 2 :

బిడ్డ వెల్లికల పరున్నప్పుడు, తల్లి కాళ్ళు పట్టుకొని ఒకదాని తర్వాత ఒక మోకాలును వొత్తి కడుపు వేపుకు మడత వేస్తుంటుంది (బైసికిల్ చక్రపు ఊపులాగా). ఈ సాదన కడుపు కండరాలను పెంపొందిస్తుంది. ఇది ముఖ్యంగా మలబద్ధకం, ఉబ్బుకడుపు వున్న పిల్లలకు ప్రత్యేకంగా సూచింపబడుతుంది.

కసరత్తు 3 :

బిడ్డ కడుపు క్రింద ఒక చేతిని ఆధారంగా పెట్టి, రెండవ చేత్తో కాళ్ల దగ్గర పట్టుకోవాలి. (ఈతగావి ఊపు). ఈ సాధన శరీరంలోని కండరాలన్నీ బలం పొందను సహాయకారి అవుతుంది.



కసరత్తు 4 :

చిన్న మెత్తమీద బిడ్డ అరచేతులు ఆనించి, ఆ చేతులమీగ బిడ్డ బరువు మోపివుండగా తల్లి కాళ్ళను పట్టుకొని (ఒంటి చక్రపు త్రోపుడు బండి ఊపులో) జాగ్రత్తగా పైకెత్తుతుండాలి.

---

## విషయసూచిక



సమృద్ధమైన నూనె గనులకు నిలయమైన బురైమీ ఒయాసిస్సును (సౌదీ అరేబియా) బలాత్కారంగా వశపరచుకోను బ్రిటిష్ కంపెనీలు సాయుధ సన్నాహం చేశాయి.

—“మళ్ళీ మన ఒయాసిస్సు మందుగుండు వాసన కొడుతున్నది.”
—“అవునవును వలస పెత్తందార్ల కిక్కడ నూనెవాసన కొట్టినందుకు.”

చిత్రకారుడు గొర్యయేవ్ (హాస్య పత్రిక “క్రొకదిల్” నుండి పునర్ముద్రితం)

భారత దేశంలోని సోవియట్ రాయబార కార్యాలయ సమాచారశాఖ తరపున, జి. ఎఫిమోవ్‌చే 25, బారాకంబా రోడ్, న్యూ ఢిల్లీ నుండి సంపాదితము, ముద్రితము, ప్రచురితము. ముద్రాపకులు, పంజాబి ప్రెస్, సదర్ బజార్, ఢిల్లి.

